# గోమాత కోసం

# ఓ హిందువు పోరాటం

గోమాంస ప్రియుల వాదనను చీల్చి చెండాడడానికి 94 మార్గాలు

గోమాత కోసం ఓ హిందువు పోరాటం



ఈ ముద్రణ గోమాంసం సబ్జెక్ట్ పైన ఖచ్చితమైన విషయం, అధికారపూర్వకమైన సమాచారం కోసం నిర్మించడం జరిగింది.

మరింత సమాచారం కోసం సంప్రదించండి

books@agniveer.com

ఈ పుస్తకాన్ని కూర్పు, రూపకల్పన చేసింది రోనక్ త్రివేది.

మొట్టమొదటి ముద్రణ: సెప్టెంబరు, 2018

# గోమాత కోసం
# ఓ హిందువు పోరాటం

గోమాంస ప్రియుల వాదనను చీల్చి చెండాడడానికి 94 మార్గాలు

రచన

సంజీవ్ నెవర్

తెలుగు అనువాదం

పల్లం అమర్ చంద్

# పీఠిక

బలహీనులలను మనం ఎలా చూస్తామో అన్నదాని బట్టే మనం ఎటువంటి వారమో తెలుస్తుంది. పశుపక్షాదులు మనకు ఆహారం కాదు. అవి చక్కటి స్నేహితులు అని హిందూ ధర్మానికి పునాదులైన పవిత్ర వేదాలు చెప్పాయి. పవిత్ర యజుర్వేదంలోని తొలి మంత్రం "పశున్ పాహి"తో ముగుస్తుంది. జంతువులను చంపవద్దు! మనలాగా నవ్వుతూ, ఆడుతూ, ఏడుస్తూ, సంతోషిస్తూ, బాధ పడే ఏజీవి అయినా మనలాగే జీవించాలి. వాటి ఉన్ని కోసమో, మాంసం కోసమో చంపబడకూడదు.

మనకు విలువైన పాలిచ్చి సేవ చేసే జీవులు మన తల్లిలాగానే ప్రేమించబడాలి, రక్షించబడాలి. అందువల్లనే హిందూ ధర్మంలో ఆవును తల్లిలాగా గౌరవిస్తారు. దురదృష్టమేంటంటే, గోమాంసంకు మద్దతుగా కుతంత్రమైన అతివాదం ప్రచారం జరుగుతుంది. వారి అభిప్రాయం ఏంటంటే, హిందువులు గోమాంసం ఎప్పుడూ తినేవారు అంతేకాకుండా హిందు గ్రంధాలు కూడా గోమాంసం ప్రోత్సహించింది అని. ఇంకొంతమంది గోమాంసం ఎగుమతి దేశ ఆర్ధిక ప్రయోజనాల దృష్ట్యా తప్పనిసరి అని. మరికొందరేమో ఆవుని తినొచ్చు ఎందుకంటే మొక్కలకి కూడా బాధ ఉంది అవి కూడా నెప్పిని అనుభవిస్తున్నాయని.

ఇలాంటి నిరాధార ఆరోపణలు, పిలగాడి ప్రశ్నలు చెప్పుకుంటూ పోతే పెద్ద చిట్టానే తయారు అవుతుంది. అబద్ధాన్ని నిజమని వందసార్లు ఊదరగొడితే ఒక క్షణం నిజమేనేమో అనిపించినా, అది ఎప్పటికీ సత్యంఅవదు.

ఈ పుస్తకంలో జంతువధ, గోమాంసం ఆహరపు అలవాట్లపై వచ్చిన అన్ని ప్రశ్నలను, ఆరోపణలను, వాదనలను నిశితంగా పరిశీలించడం జరిగింది. అన్నిటికీ తిరుగులేని సమాధానాలు, ఓడిపోని తర్కవివరణ ఇవ్వడమే కాక వాటిని సమర్ధిస్తూ గ్రంధాల సాక్షాలు ఎన్ని కావాలో అంతకంటే ఎక్కువే ఇచ్చిన ఏకైక పుస్తకం ఇది. ఈ పుస్తకంతో హిందూమతం ఇచ్చే నిజమైన సందేశం మనకు అర్ధం అవడమే కాక హిందూ ధర్మాన్ని వక్రీకరించే వాళ్ళ నోళ్ళు మీరు మూయించగలరు.

మేము పదేళ్ళుగా ప్రచురించిన మా బ్లాగు భాగాలు ఈ పుస్తకానికి మూలం. ఇంతవరకు అందులోని ఒక్క వాక్యానికి కూడా ఎవ్వరూ ఎదురు చెప్పలేకపోయారు.

సనాతనం లోని ఇలాంటి వివిధ రకాలైన అంశాలాపై పరిశోధన చేసి సులభంగా అర్థమయ్యే చిన్న చిన్న పుస్తకం రూపేణా అందజేయలనుకొంటోంది.

గోమాంసంపై చేసిన తప్పుడు ఆరోపణలన్ని తోసిపుచ్చుతుంది ఈ "హిందూత్వం కనుగొనడం" అనే శ్రేణిలో మొదటి సంపుటి. ఇదేబాటలో హిందూత్వం నిలబెట్టే మరిన్ని సంపుటాలు వస్తాయి. హిందూత్వంపై మీకేమైన దురభిప్రాయాలు ఉంటే వాటిని ఈ శ్రేణి పుస్తకాలు పటాపంచలు చేస్తుంది. ప్రపంచానికి హిందూత్వం ఎంత విలువైన బహుమతో మీరు కూడా అంగీకరిస్తారు.

హిందూత్వం ఒక్కటే ఏకైక మతతత్వం మతపరమైన అసహనాన్ని ఖండించి స్వేఛ్ఛకు అవకాశం ఇస్తుంది. ఒకే మతపరమైన ఛట్రంలో బందీని చేయకుండా మనకు అనుకూలంగా, వ్యక్తిగతంగా మార్పులకు వెసులుబాటు ఇస్తుంది. హిందూత్వం రెండు ముఖ్యమైన పునాదులపై ఉంటుంది.

- ప్రతి అడుగు లోనూ సత్యాన్వేషణ.
- సాటి జీవులకు వాటి సత్యాన్వేషణలో సహనంతో సహకరించాలి.

హిందూ ధర్మంలో ఎవరినీ బలవంతపెట్టడం కానీ, నరకాగ్ని ఉందని బెదిరించడం కానీ, మీ ప్రార్ధన పద్దతులను తిరస్కరించడం కానీ, నాస్థికులను వేర్పాటువాదంతో కలుపుకోకుండా వదిలేయడం గానీ జరగదు.

హిందూత్వంలో ఉన్నదల్లా సాటిజీవిని అర్థం చేసుకోవడం, మానవత్వంతో పరిణితి చెందిన మానవుడిగా బ్రతకాలని ప్రతి నిముషం తపించడం. హిందువా, ముస్లిమా అని కాకుండా ఒక సాటి మనిషిగా బ్రతకమని, చూడమని హిందూత్వం ప్రభోదిస్తోంది.

ప్రపంచం మర్చిపోయిన అసలైన మానవత్వాన్ని ఈ పుస్తక శ్రేణి తిరిగి ముందుకు తీసుకొస్తుందని మేము ఆశిస్తున్నాము. ప్రస్తుత వస్తు, ధన దాహంతో ఉన్న సమాజానికి, ఛాందసమత పిచ్చికి ఇది ఎంతో అత్యవసరం. ఈ మానవత్వంతో మీకో కొత్త మార్గం కనిపిస్తుంది అని ఆశిస్తున్నాము.

ఈ పుస్తకం అమ్మడం ద్వారా వచ్చే ప్రతి ఆదాయం హిందూ పరిరక్షణకొరకు వాడతాము. కనుక ఈ పస్తకాన్ని అందరికీ తెలిపి వీలైతే మరికొందరికి పంచడము, బహుమతిగా ఇవ్వడం లాంటివి చేసి మానవత్వసేవకు సహకరించగలరు.

ధర్మో రక్షతి రక్షితః.

అంటే మనం ధర్మాన్ని రక్షిస్తే,

ధర్మం తిరిగి మనల్ని రక్షిస్తుంది.

-సంజీవ్ సెవార్

# విషయసూచిక

అధ్యాయం 1

# హిందూత్వంలో గోమాంసం లేనే లేదు

మనిషిని జంతువు లాగా చూడటం అధర్మం, జంతువును మనిషిలాగా చూడటం ధర్మం.

-అగ్నివీర్

ఈ పుస్తకంలోని మొదటి రెండు అధ్యాయాలలో పొందుపరచిన విషయ పరిజ్ఞానం, వేదమంత్రాలను సరైన సంగ్రహణం కొరకు వేదాలలో వాడిన పదాల యొక్క మూలాలు, వాటి లక్ష్య విశ్లేషణ, వాటిని ఏ సందర్భంలో వాడారు, వేద పదజాలం, ప్రాచీన భాషైన వాటి వ్యాకరణాలను నిశితంగా సంపూర్ణంగా పరిశీలించి రాయడం జరిగింది.

కనుక, ఈ పుస్తకం లోని మొదటి రెండు అధ్యాయాలు పైన చెప్పిన విధంగా రాయడం జరిగింది. అంతేకాని భారతీయ సంస్కృతిపై పాశ్చాత్య దేశాలకు చెందిన అధ్యయనకారులు రాసిన మ్యాక్స్ ముల్లర్, విల్సన్, విలియంస్ లాంటివాళ్ళ రాసిన రచనలపై ఆధారపడలేదు.

వీరు పాశ్చాత్య దేశాలలో సమకాలీన విద్యా రంగంలో పేరొందిన వారైనప్పటికీ వారి రచనలు మనం అధికారికంగా తీసుకోలేము. ఎందుకంటే అప్పుడు భారతదేశం బ్రిటీషు వారి పరిపాలనలో ఉంది. వారు ఇలాంటి రచనలకు కావల్సిన దానికంటే ఎక్కువే ప్రచారం ఇచ్చి పేరు వచ్చేలా చేశారు. అప్పట్లో వీరికి సహకరించిన భారతీయ విద్యావేత్తలు సంస్కృతం వచ్చు, కానీ ఇంగ్లీషు రాదు. ఈ అంశాన్ని మరింత లోతుగా ఈ పుస్తకంలో ముందు ముందు పరిశీలిస్తాం.

## వేదాలను అప్రతిష్టపాలు చేయడం

కొన్ని శతాబ్దాలుగా వేదాలను వక్రీకరించి బురద జల్లుతూ అప్రతిష్ఠ చేయాలని చూస్తున్నారు. మన ఆది శాస్త్రాలైన వేదాలలో లేని వాటిని కలిపి ప్రక్షిప్తాలు సృష్టిస్తూ అపవిత్రం చేస్తూనే ఉన్నారు. ఎవరైనా ఇటువంటి వక్రీకరణ సాహిత్యాన్ని చదివితే కనుక వాళ్ళకు అవిఘ్నానమైన మన భారతీయ సంస్కృతి, హిందూ తత్వం, సంప్రదాయాలు ఇవేమి కనిపించక కేవలం బానిసత్వం, నర మాంసం తినే ఆటవికం మాత్రమే కనిపిస్తాయి.

వేదాలు, హిందుత్వానికి వేరు వంటివి. భూమిపైన తొలి జ్ఞానానికి, పరిజ్ఞానానికి, విజ్ఞానానికి మూలాలు. ఇవి పరమానందభరితమైన జీవనాన్ని గడుపుటకు వ్యక్తి చేయవలసిన కార్యాలను నిర్దేశం చేస్తాయి. ప్రపంచవ్యాప్తంగా ఉన్న హిందువులను ఇబ్బంది పెట్టడానికి వేదాలలోని కొన్ని ప్రస్తావనలను తీసుకుని కేవలం స్వలాభం ఆశిస్తూ వాటిని వక్రీకరించి అపవాదు లతో ప్రచారాన్ని చేస్తున్నారు.

ఈ అసత్య ప్రచారం పేదవాళ్లకు, చదువులేని భారతీయులకు చేరువయ్యే విధంగా చేసి వారి పవిత్ర గ్రంథాలపై ఉన్న నమ్మకాలను వమ్ము చేస్తున్నారు. వేదాలలో స్త్రీలను చులకన చేశారని, మాంసాహారం ఉండేదని, బహుభార్యత్వం ఉందని, కులతత్వం ఉందని అన్నిటి కంటే ముఖ్యమైనది అందరూ గోమాంసం తినేవారని మాయ చేస్తున్నారు.

హిందూ క్రతువులలో జంతు బలులు ఉండేవని, ప్రాముఖ్యమైన యజ్ఞాలలో కూడా ఇవి పాటించేవారని వేదాలను నిందించారు. కొంత మంది మనదేశంలోనే మేధావులుగా చెప్పుకుంటూ, ప్రాచీన భారత దేశాన్ని అధ్యయనం చేసిన వ్యక్తులుగా పేర్కొంటూ, చివరకు పాశ్చాత్య

భారతీయ ధర్మసూత్ర అధ్యయనకారులైన (Indologist) రాసిన పుస్తకాలలోని ప్రస్తావనలను తీసుకుని వేదాలలో అపవిత్రం ఉందని వక్రంగా నిరూపిస్తున్నారు.

వేదాలలో గోహత్యలు, గోమాంసం తినడానికి అనుమతి ఉందనటం హిందూ పవిత్ర ఆత్మ లపై కోలుకోలేని దెబ్బ కొట్టడమే. హిందూత్వ మూల సిద్ధాంతాలలో ఒకటి గోవును గౌరవించటం. హిందూ మూల సిద్ధాంతాలలో తప్పున్నదని ఒకవేళ ఎవరినైనా ఒప్పించగలిగితే ఇక అతను అన్యమత విశ్వాసాలకు దొరికినట్టే. ఇలా లక్షల మంది హిందువులు ఇటువంటి అసత్యాలను ఎలా ఎదిరించాలో తెలియక వారి కుతంత్రాలకు లొంగిపోతున్నారు.

స్వలాభాపేక్షతో వేదాలను మలినం చేయడం భారతీయ సాంస్కృతిక అధ్యయనకారుల దగ్గరో, విదేశీ అధ్యయనకారుల దగ్గరో ఆగిపోలేదు. హిందువులలోనే కొన్ని వర్గాలు మిగిలిన వర్గాలను ముఖ్యంగా సామాజికంగా, ఆర్థికంగా వెనకబడిన వారిని వేదాల వక్రీకరణలను బలవంతంగా నమ్మేటట్లు చేసి వారి శ్రమను దోచుకున్నారు. లేనిపక్షంలో వారిపై దౌర్జన్యాలు చేయటం మొదలుపెట్టారు.

వేదాల గురించి మధ్యయుగం కాలంలో ఇటువంటి అపవాదులను, అసత్యాలను కుప్పలుగా పోసి వాటిపై వ్యాఖ్యానాలు రాసినవారిలో ముఖ్యంగా మహీధర్, ఉవత్, సాయన. అలాగే వామ మార్గం, తాంత్రీక సంస్కృతి వేదాల పేరుతో చొప్పించబడింది.

పాశ్చాత్య అధ్యయనకారులు అరకొర సంస్కృతం పరిజ్ఞానంతో తెలిసీ తెలియక వారికి మహీధర్, సాయన వారి రచనలకు అనువాదాలు పేరుతో సంగ్రహాలు, వాఖ్యానాలు చేశారు. ఇవే కాలక్రమేణా బాగా ప్రసిద్ధి చెందడం, సమాజంలో పాతుకుపోవడం జరిగింది.

అయినప్పటికీ, కనీస ఆవశ్యకత మైన కింది వాటి గురించి ఎటువంటి అవగాహన లేకుండానే రాశారు.

- శిక్ష (phonetics)
- వ్యాకరణం (grammar)

- నిరుక్త (word roots and derivation)
- నిఘంటువు (vocabulary)
- ఛంధ్రస్సు (prosody)
- జ్యోతిష్యం (astronomy)
- కల్పం

ఇవన్నీ వేదాలను సంగ్రహించడానికి అత్యంత అవసరం.

వేదాలను కించ పరిచేటటువంటి ప్రచారాలను బహిర్గతం చేసి, వేదాలపై ఉన్న అపోహాలను, దురభిప్రాయాలను పటాపంచలు చేయడానికి అగ్నివీర్ కృతనిశ్చయంతో ఉంది. తద్వారా ప్రపంచ జ్ఞానానికే కేంద్రమైనా వేద పరిజ్ఞానంతో ప్రపంచాన్ని జాగృతం చేద్దాం, మొత్తం మానవత్వాన్నే జ్ఞానోదయం చేద్దాం.

సరే ఇప్పుడు యజ్ఞాలలో గోమాంసం, జంతుబలి గురించి అసలు వేదాలు ఏంచెప్పాయో తెలుసుకుందాం.

## వేదాలలో జంతుహింస చేయరాదని ఉంది

యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః

యజుర్వేదం 40.7

“ఎవరైతే సమస్త ప్రాణిని తమ తన/ఆత్మ వలె చూచెదరో అతను ఏకమాత్రుడై మోహాశోకములు కానీ రాగద్వేషములు కానీ ఉండక ఆనందంగా ఉండెదరు.”

ప్రాణికోటిని నాశనం చేయకూడదని, ఇతర ప్రాణిలోకి పరకాయ ప్రవేశం చేసినంతగా వాటిని అర్ధం చేసుకొన్న వేద భావజాలాన్ని కనిపిస్తుంటే అసలు ఎవరైనా యజ్ఞాలలో జంతువధ ఉందంటే ఎలా నమ్మగలిగారు?

గతించిన తమ దగ్గరి వారి ఆత్మలే ఈ జంతు ప్రాణిలో చూసుకుంటారు కదా.

అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ
సంస్కర్తా చోపహర్తా చ ఖాదకశ్చేతి ఘాతుకాః

మనుస్మృతి 5:51

"ఎవరైతే జంతువులను నరకడాన్ని సమ్మతిస్తారో, ఎవరైతే జంతువులను చంపడానికి తెస్తారో, ఎవరు జంతు మాంసం అమ్ముతారో, ఎవరు కొంటారో, ఎవరు మాంసాన్ని వండుతారో, ఎవరు వడ్డిస్తారో, ఎవరైతే తింటారో అందరూ ఆ హత్యచేసిన నేరస్థులే."

వ్రీహిమత్తమం యవమత్తమథో మాషమథో తిలమ్
ఏష వాం భాగో నిహితో రత్నధేయాయ దన్తౌ మా హింసిష్టం పితరం మాతరం చ

అథర్వణవేదం 6.140.2

"రెండు వరుసలలో పళ్ళు మొలచిన ఓ బాలుడా, నీకై ఉంచబడిన బియ్యం, గోధుమలు, మినుములు, నువ్వులు తిను. జన్మనివ్వగల జంతువులను చంపితినకు."

య ఆమం మాంసమదన్తి పౌరుషేయం చ యే క్రవిః
గర్భాన్ ఖాదన్తి కేశవాస్తానితో నాశయామసి

అథర్వణవేదం 8.6.23

"వైద్యులైన వారు ఏ కీటకములు, సూక్ష్మక్రిములైతే పచ్చి మాంసం కానీ, వండిన మాంసం కానీ, కేశములు కలిగిన గర్భస్థ పిండములను తినునో

వాటిని నశింపచేసి మనుషులను కాపాడవలెను.”

అనాగో హత్యావైభీమా కృత్యేమానో గామశ్వం పురుషం వధీః
అథర్వణవేదం 10.1.29

“అమాయక మూగ జంతువులను చంపడం ఖచ్చితంగా పాపం. గుర్రాలను, గోవులను, మనుష్యులను చంపవద్దు.”

వేదాలలో జంతువులను చంపవద్దని సూటిగా చెప్పినా, లేని జంతువధ ఉందని అంటే ఎలా సమర్ధనీయం?

ఇషేత్వోర్జే త్వా ...
...గోపతౌ స్యాత బహ్వీర్య యజమానస్య పశోన్పహి.
యజుర్వేదం 1.1

“ఓ మానవుడా జంతువులు చంపకూడనివి. వాటిని చంపకుండా రక్షించుము.”

ఘృతేనాక్తౌ పశూం స్త్రాయేథాం ...
యజుర్వేదం 6.11

“జంతువులను కాపాడుము.”

వేదాలలో రాక్షసులను, దుష్టులను సంబోధించుటకు చాలా పదాలు వాడారు. అవి వారి మాంసాహారపు అలవాట్ల నుండే పుట్టినాయి. అవేంటో చూద్దాం రండి.

- క్రావ్యద - క్రావ్య [వధించి తెచ్చిన మాంసం] + అద [తినడం] - మాంసం తినేవాడు.

- పిశాచ - పిశిత [ మాంసం ] + అశ [తినడం] - మాంసం తినేవాడు.
- అశుత్రప - అశు [ఆయువు] + త్రప [బతికేవాడు]- ఇతరుల ప్రాణం తీసి ఆహారంగా చేసుకొని బ్రతికేవాడు.
- గర్భద - పిండాలను తినేవాడు.
- అండద - గుడ్లు తినేవాడు.
- మాంసద - మాంసం తినేవాడు.

మాంసాహారులను వేద సాహిత్యాలలో హీనులుగా చెప్పేవారు. వాళ్లను రాక్షసులుగా, పిశాచులుగా వర్ణించేవారు. ఇవి నాగరిక సమాజం నుంచి వెలివేయబడిన భూతాలకు, దెయ్యాలకు పర్యాయపదాలు. అలాంటిది వేదాలలో మాంసాహారం ఉండేదన్నది ఏ విధంగా సమంజసం?

అన్నపతే న్నస్య నో దేహ్యనమీవస్య శుష్మిణః
ప్రప్ర దాతారం తారిష ఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే.

యజుర్వేదం 11.83

"మనుష్యులతో పాటు రెండు కాళ్ళ, నాలుగు కాళ్ళ జంతువులన్నీ బలంగా, పౌష్టికంగా ఎదగాలి."

హిందువులందరూ భోజనం చేసేముందు ఈ మంత్రాన్ని తప్పనిసరిగా జపిస్తారు. సృష్టిలోని ప్రతి ప్రాణి మంచిగా ఉండాలని, జీవితంలోని ప్రతి ఘట్టాన్ని ఆనందంగా జీవించాలని కోరుకుని అదే హిందూత్వం జంతువులను చంపమని ఎలా చెప్పగలదనుకొన్నారు?

## వేద యజ్ఞాలలో హింస లేదు

"యజ్ఞం అంటే జంతుబలి అని సమాజంలో చొప్పింపబడిన అభిప్రాయం. అసలు అది సత్యం కానే కాదు. అది ఒక పవిత్ర కార్యం లేదా అత్యంత ప్రక్షాళన కార్యం అని అర్థం."

అధ్వర ఇతి యజ్ఞా నామ ధ్వరతిహిం సాకర్మ తత్ప్రతిషేధహః

నిరుక్త 2.7

యాస్కాచార్యుల వారి ప్రకారం యజ్ఞం యొక్క పర్యాయపదం నిరుక్తలో కానీ వేద పరిభాషలో కానీ ఏమిటని అంటే అది “అధ్వర”. ధ్వర అంటే హింస. కాబట్టి అ-ధ్వర అంటే అహింస అని అర్థం. ఇలాంటి పదప్రయోగం వేదాలలో చాలా సార్లు మనకు కనిపిస్తుంది.

మహాభారత తరువాతి కాలంలో, వేదాలను తప్పుగా అనువదించడం మరియు కాలక్రమేణా వేదాలను వేరే శాస్త్రాలలో చాలా చోట్ల అంతర్వేశనం చేయడం జరిగింది. శంకరాచార్యులవారు చాలామట్టుకు వాటిని పునర్నిర్మాణం చేశారు. ఇప్పటి కాలంలో అయితే, నవీన భారత దేశానికి తాత వంటివారుగా పిలువబడే, స్వామి దయానంద సరస్వతి గారు వేదాలను సరైన భాషాపరమైన నియమాలతో, ఖచ్చితమైన ఆధారాలతో అనువదించి మనకు సమగ్ర పరిచారు.

సత్యార్థ ప్రకాశం, ఆయన రాసిన సాహిత్యం లోనిది. ఇది వేదాలపై వారిచ్చిన వ్యాఖ్యానం. ఆయన రాసిన వేద పరిచయం పుస్తకం మరియు ఇతర రచనలకు బహుళ ప్రచారం లభించి వైదిక తత్వంతో కూడిన సామాజిక మార్పునకు శ్రీకారం చుట్టబడింది. వేదాలపై ఉన్న అపోహలను అవి పటాపంచలు చేసాయి.

యజ్ఞాల గురించి వేదాలు ఏం చెప్పాయో తెలుసుకుందాం పదండి.

అగ్నే యం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి స ఇద్ దేవేషు గచ్ఛతి

ఋగ్వేదం 1.1.4

“దేదీప్యమైన ఓ భగవంతుడా! అన్ని దిక్కుల నుంచి అహింసతో కూడిన యజ్ఞం అందరికీ సంక్షేమకరం. అటువంటి కార్యానికి మహాత్ములతో తోడ్పాటు తోపాటు, దైవానుగ్రహం కూడా తోడవుతుంది.”

ఋగ్వేదం అంతటా యజ్ఞాన్ని ఆధ్వర గానూ, అహింస గానూ వివరించింది. అలానే మిగిలిన వేదాలలో కూడా అలాగే వర్ణించారు. అలాంటప్పుడు వేదాలలో హింస ఉందని, జంతువులను వధించారు అని ఎలా నిర్ణయించి చెప్పగలరు?

యజ్ఞాలలో గోవధలు, పశువధలు, అశ్వమేధ యజ్ఞ, గోమేధ యజ్ఞ, నరమేధ యజ్ఞ పేరులతో ఉన్నాయని అతిపెద్ద అభాండం వేశారు. కనీసం గుడ్డిగా ఊహించుకున్నా "మేధ" అనే పదం "వధ"కు ఏ సందర్భంలోనూ సరిపోదని అర్థం అవ్వటం లేదా? పైగా యజుర్వేదంలో అశ్వం గురించి ఏమి చెబుతుందో చూద్దాం.

ఇమమ్ మా హింమ్ సీరేకశఫం పశుం కనిక్రదం వాజినం వాజినేషు

యజుర్వేదం 13.48

"ఒంటి డెక్క కలిగి సకిలించే గుణాలున్న, చాలా జంతువులకంటే వేగంగా పోగల అశ్వాలను మరియు ఉపకారకమైన అడవి జంతువులను సైతమూ చంపకూడదు."

అశ్వమేధ అంటే అశ్వాన్ని బలివ్వటమని కాదు. పైగా యజర్వేదం చాలా స్పష్టంగా చెప్పింది అశ్వాన్ని వధించకూడదని. శతపదలో "అశ్వ" అంటే "దేశమని లేదా సామ్రాజ్యం" అని అర్దం.

## అశ్వమేధ, గోమేధ, నరమేధ యజ్ఞాలు

మేధ అంటే వధ అని కాదు. మేధస్సుతో కూడి చేసిన కార్యమని అర్థం. మేధ అనే పదం 'మేధ్రు- సం-గ-మే' అనే ధాతువు నుండి వచ్చినది. సంస్కృతం వ్యాకరణ గ్రంధంలో పదాల మూలాలు, వాటి ప్రతిపదార్థాలు ఇవ్వ బడ్డాయి.

రాష్ట్రం వా అశ్వమేధః
అన్నమ్ హి గౌః

అగ్నిర్ వాలశ్వాః
ఆజ్యం మేధః

శతపధము 13.1.6.3

స్వామి దయానంద సరస్వతి గారు తన సత్యార్ధ ప్రకాశం అనే గ్రంధంలో ఇలా అన్నారు.

“రాజ్యము/దేశము యొక్క మనుగడ, అభివృద్ధి, కీర్తి కొరకు అంకితమొనర్చే ప్రక్రియను అశ్వమేధ యాగం అంటారు. “

“అన్నము, ఇంద్రియములు, కిరణములు భూమిని మొదలగువాటిని పవిత్రముగా ఉంచటాన్ని గోమేధ మంటారు.”

‘గా’ అంటే భూమి అని అర్ధం. “భూమి పర్యావరణాన్ని స్వచ్ఛంగా ఉంచడాన్ని గోమేధమంటారు.”

“వైదిక సాంప్రదాయంతో శవాన్ని దహన సంస్కారం చేయటాన్ని నరమేధ యజ్ఞం అంటారు.”

## వేదాలలో గోమాంసం లేదు

వేదాలలో జంతు వధను వ్యతిరేకించడమే కాదు, నిర్ద్వంద్వముగా గోవధను నిషేధించారు. మానవాళికి శక్తినిచ్చే ఆహారం గోమాత అందిస్తున్నందున యజుర్వేదం గోవధను నిషేధించింది.

ఘృతందుహనామదితిం జనాయాగ్నే మా హింసీః

యజుర్వేదం 13:49

“ఆవులను ఎద్దులను చంప వద్దు. అవి రక్షించ దగినవి.”

ఆరె గోహా నృహా వధో వో అస్తు

ఋగ్వేదం 7.56.17

"ఋగ్వేదంలో గోవధను మనిషిని హత్య చేసినంత నేరపూరితమైన దుశ్చర్యగా అభివర్ణించారు. ఇలా చేసిన వారిని శిక్షించమని కూడా చెప్పారు."

సోయవసాద్ భాగవతీ హి భూయా అధా వయం భగవన్తః స్యామ అద్ధి తృణమఘ్న్య
విశ్వదానీం పిబ శుద్ధముదకమాచరన్తి

ఋగ్వేదం 1.164.40 లేదా అథర్వణవేదం 7.73.11 లేదా అథర్వణవేదం 9.10.20

"గోవులు అల్ప మూల్యమగు తృణములు తిని, శుద్ధ జలము తాగి మనకు పాలు, పెరుగు, వెన్న మొదలైనవి మనకు ఇచ్చి మేలు చేస్తోంది కదా అలాగే మనుషులు కూడా తక్కువ వ్యయముతో శుద్ధ ఆహార, విహారాదులను తీసుకొని ప్రపంచానికి ఇంకోరకంగా మేలు చేయాలి."

వేద కోశము, నిఘంటువు, గో (ఆవు) అను పదానికి అఘ్న్య, అహి, ఆదితిగా చెప్పబడ్డాయి. నిఘంటువుపై వాఖ్యానం చేసిన యాస్కుల వారు ఇలా నిర్వచించారు.

- అఘ్న్య - చంపకూడనివి.
- అహి - అస్సలు చంపకూడనివి.
- ఆదితి - ముక్కలుగా చేయకూడనివి.

ఈ మూడు పదాలు గోవును సూచిస్తాయి. జంతువులను హింసించకూడదని చెప్పాయి. ఈ పదాలు వేదమంతా ఎక్కడ గోవు సంబంధించిన ప్రస్తావన వచ్చినా ఇవి కనిపిస్తూ ఉంటాయి.

అఘ్న్యేయం స వర్ధతాం మహతే సౌభాగ్య

ఋగ్వేదం 1.164.27

"గోవు-అఘున్య మనకు ఆరోగ్యాన్ని, సౌభాగ్యాన్ని చేకూరుస్తాయి."

సుప్రపానం భవత్వఘున్యాయః

ఋగ్వేదం 5.83.8

"శుభ్రమైన మంచినీటి వసతి గోవులకు-అఘున్య అందజేయాలి."

యహ్ పౌరుషేయేన క్రవిష సమన్క్తే యో అశ్వేన పాషున యాతుధానాః
యో అఘున్యాయా భారతి క్షీరమగ్నే తెషాం షీర్షానీ హరసాపి వ్రిషచ

ఋగ్వేదం 10.87.16

"ఎవరైతే మనుషుల, అశ్వాల, ఇతర జంతువుల మాంసంపై తిని బతుకుతారో మరియు ఎవరయితే పాలిచ్చే ఆవులను నాశనం చేస్తారో వారిని తప్పనిసరిగా తీవ్రంగా శిక్షించాలి."

విముచ్యధ్వమఘ్న్యా దేవయానా అగన్మ తమసస్పారమస్య
జ్యోతిరాపామ

యజుర్వేదం 12.73

"అఘున్య - ఆవులు, ఎద్దులు మనకు శ్రేయస్సును తెస్తాయి."

మా గామనాగామందితం వధిష్ఠ

ఋగ్వేదం 8.101.15

"ఆవును చంప వద్దు. అది చాలా అమాయకమైనది.

ఆదితి - అనగా ముక్కలుగా చేయకూడనిది."

## అంతకాయ గోఘాతం

యజుర్వేదం 30.18

“గోవులు చంపువారిని అంతం చేయుము.”

యది నో గాం హంసి యద్యశ్వం యది పూరుషమ్
తం త్వా సీసేన విధ్యామో యథా నో సో అవీరహ

అథర్వణవేదం 1.16.4

“ఎవరైతే ఆవులను, గుర్రాలను, మనుషులను చంపి నశింపజేయుదురో వారిని జ్ఞానముతో బంధితుము.”

సహృదయం సాంమనస్యమవిద్వేషం కృణోమి వః
అన్యో అన్యమభి హర్యత వత్సం జాతమివాఘ్న్యా

అథర్వణవేదం 3.30.1

“సాటి మనుషులను ప్రేమించాలి. తల్లి ఆవు ఎలా తన దూడను ప్రేమతో మెలగునో అలానే మనమూ అహమును వీడి ప్రేమించాలి.”

యజ్ఞం దుహానం సదమిత్ ప్రపీనం పుమాంసం ధేనుం సదనం రయీణామ్
ప్రజామృతత్వముత దీర్ఘమాయూరాయశ్చ పోషై రుప త్వా సదేమ

అథర్వణవేదం 11.1.34

“యజ్ఞము చేసిన వారికి మంచి నడవడి, విద్య, ఆవులు, ధన కోశములు, సంతాన వృద్ధి, దీర్ఘాయుష్షు లభించి ఆనందముతో సుఖించుదురు.”

## ఋగ్వేదం 6 వ మండలం

ఋగ్వేదంలోని మొత్తం 28 వ సూక్తం గానీ 6 వ మండలంలో ఉన్న శ్లోకాలు గానీ ఆవు యొక్క వైభవాన్ని పేర్కొంటాయి.

ఆ గావో అగ్మ మన్ను త భద్రామక్రంస్తీదంటు
భూయో భూయో రయిమిదస్య వర్ధాయన్న భిన్నే
న తా నషంతి న దభాతి తస్కరో నాసామమిత్రో వ్యధిరాదధర్షతి న తార్వ
రేనుకకాతో అష్మ తె న సంస్కృత్రాముపయంతి త అభి గావో భాగో గావ
ఇంద్రో మె అచ్చన్ యోయమ్ గావో మీదయథా
మా వ స్థెన ఈషత మాఘన్షసహ్

- ప్రతి ఒక్కరూ గోవులను ఆరోగ్యంగా, భాధలు లేకుండా చూసుకోవాలి.
- ఎవరతే గోసంరక్షణ చేస్తారో వారిని దేవదేవతలు దీవిస్తారు.
- శత్రువుల గోవులపై కూడా ఆయుధాలు ప్రయోగించి హని కలిగించరాదు.
- ఆవుని ఎవరూ వధించరాదు. ఆవు మనల్ని బలవంతులను చేసి అభివృద్ధిని కలిగిస్తుంది.
- ఆవులు ఆరోగ్యంగా జబ్బులు పడకుండా ఉంటే ఆడవారు, మగవారు కూడా ఆరోగ్యంగా వృద్ధి చెందుతారు.
- ఆవు పచ్చి గడ్డి తిననిద్దాం, మంచి నీళ్ళు తాగనిద్దాం. వాటిని చంపకుండా మనం కూడా వృద్ధి చెందుదాం.

## వాదనలు, వాస్తవాలు

మన వేదాలు, పురాతన సంస్కృతి కొన్ని వర్గాల యొక్క ఇప్పటి భావజాలం కంటే మెరుగైనవని, ఇప్పటికే విఫలమైన వారి కమ్యూనిస్టు సిద్ధాంతాల కంటే అత్యుత్తమమైనవని ఎవరైనా అంటే తీవ్రంగా

ప్రతిఘటిస్తారు. నేను చేసిన పరిశోధన తోసిపుచ్చాలని ఎక్కడెక్కడివో, ఏవేవో గోమాంసం గురించిన ప్రస్తావనలు ఈమెయిళ్ల రూపంలో నాకు పంపేవారు. రెండు మంత్రాలు ఏమో ఋగ్వేదంలో నుంచి, కొన్ని శ్లోకాలు మనుస్మృతి లోంచి, ఇతరత్రామరికొన్ని పట్టుకొచ్చే వారు.

వాటన్నిటికీ నేను ఈ క్రింది విధంగా బదులు ఇస్తున్నాను.

## 1
## మనుస్మృతి లోనే గోమాంసం తినేవారని, జంతుబలి ఉండేదని ఉంది.

'ఎవరైతే జంతువుల వధను అనుమతిస్తారో వారు కూడా హంతకులే' అనే మనుస్మృతి లోని ఆధారాన్ని ఈ చాప్టర్లో వివరించాము. కనుక వారు చూపించే అభాండాలు ప్రక్షిప్తాలు అయినా అయి ఉండాలి లేదా పదాలు అర్థం గాక తప్పుగా అయినా అర్థం చేసుకుని ఉండాలి.

## 2
## తాళపత్రాలలో 'మాంసం' అంటే 'జంతుమాంసమే'.

గొడ్డు మాంసాన్ని ఎలాగైనా మన గ్రంథాలలో చూపించాలని చేసే కుటిల ప్రయత్నం చూడండి ఇక్కడ. నిజానికి మాంస అనేది బహుళ అర్థాలున్న సాధారణ పదం. ఇది 'గుజ్జును' కూడా తెలుపుతుంది. 'జంతు మాంసం'ని కూడా 'మాంసం' అంటారు ఎందుకంటే ముద్దగా, గుజ్జుగా ఉంటుంది కాబట్టి. అలాగని మాంసమంటే జంతుమాంసమే అని కాదు.

వేదాలకు సంబంధించి రెండు మంత్రాలలో గోమాంసం గురించి ఉన్నాయని అభాండాలు వేశారు. అవేంటో పరిశీలిద్దాం రండి.

## 3
## ఋగ్వేదం 10.85.13: "ఇంటి ఆడపిల్లల పెళ్లి సందర్భంలో

**ఎద్దులను, ఆవులను నరికే వారు.”**

ఆ మంత్రం ఏం చెబుతోందంటే చలికాలంలో సూర్యుని కిరణాలు బలహీనపడి మరల అవి ఎండాకాలంలో (వసంత ఋతువులో) పుంజుకుంటాయని ఆ సూర్యుని కిరణాలను సూచించటానికి అక్కడ వార వాడిన పదం ‘గో’’ అంటే ఆవు అని కూడా కనుక ఆ మంత్రాన్ని సూర్యకిరణాలుగా కాకుండా ఆవుగా కూడా అనువాదం చేయవచ్చు. అక్కడ బలహీనం అనే పదానికి వాడిన పదం ‘హన్యతే’ దాని అర్థం కూడా చంపడం కానీ ఒకవేళ అదే నిజమైతే మరి ఆ మంత్రం తర్వాతనే మళ్ళీ మరోలా చెప్తుందే. మరల ఎండాకాలంలో (వసంత ఋతువులో) ఆ సూర్యకిరణాలు పుంజుకుని తిరిగి పూర్వ రూపాన్ని సంతరిస్తాయి అని. ఒకవేళ ఆవు కనుక చలికాలంలో చనిపోతే మరలా వసంత ఋతువులో తిరిగి ఆరోగ్యంగా అవ్వ గలదు? అంటే ఈ అనువాదం ఎంత చెత్తగా చేశారో లేక కావాలనే ఈ కమ్యూనిస్టులు వేదాల మలినం చేయడం కోసం చేశారో మీరే ఆలోచించుకోండి.

## 4
## ఋగ్వేదం 6.17.1: ఇంద్రుడు ఆవు, దూడ, గుర్రం మరియు గేదె మాంసాలు తినేవాడు కదా.

ఆ మంత్రం ఏం చెబుతోందంటే చెక్కముక్కలు యజ్ఞంలో అగ్నిని ఎలా రగిలిస్తుందో అలాగే చురుకైన, తెలివైన పండితులు ఈ ప్రపంచాన్ని చైతన్యమనే అగ్నిని రగిలిస్తారు.

మరి ఇలాంటి ఆ మంత్రంలో వారికి ఇంద్రుడు, ఆవు, దూడ గుర్రం, గేద ఎలా కనిపించాయో నాకైతే అర్థం కావడంలేదు.

## 5
## మరి ఇతరత్రా చెప్పబడే సంస్కృత రచనల మాటేమిటి?

ఇతరత్రా చెప్పే రచనల యొక్క అధికార సాక్ష్యాలన్నీ అవాస్తవాలే. వారి విధానం అంతా ఒక్కటే సంస్కృత గ్రంథాలలో ధర్మాలన్నీ వారికి నచ్చిన విధంగా వక్రీకరించి అవాస్తవాలు అంటగట్టడం. వారు ఎప్పటినుంచో ఇలా ప్రజలందర్నీ వారి ఋజువు చేయని మోసపూరిత సాహిత్యంతో వెర్రి వెంగళప్పలుగా చేస్తున్నారు.

## సారాంశం

వేదాలలో గోమాతకు మాత్రమే కాక సమస్త జీవాలకు ఇచ్చిన గౌరవం చూస్తే చాలదూ ఇంకా ఏ నిరూపణలూ అక్కరలేదని.

గోమాంసం, జంతువధ ఇలా అనేక అమానవీయ ఆచరణలను వేదాలు ఎండగట్టిన పైనం చదివాక పాఠకులు మీరే నిర్ణయించుకోగలరు.

నేను అందరికీ సవాల్ విసురుతున్నాను. వేదాలలో ఎవరైనా ఒక్క మంత్రం గోహత్యను సూచించినా వారు చెప్పిన మత విశ్వాసానికి నేను మారుతాను. అలా నిరూపించలేకపోతే వారు తిరిగి మన సనాతన వేద ధర్మానికి మారుతామని అంగీకరించాలి.

హిందూధర్మంలో గోమాంసం తినమని కానీ, జంతు బలి కానీ లేనే లేదు.

అధ్యాయం 2

# ఆరోపణలు, వాటి ఖండనలు

మనలోని అజ్ఞానాన్ని గుర్తించటమే సత్యాన్వేషణలో తొలి మెట్టు.

-అగ్నివీర్

గత అధ్యాయంలో, వేదాలలో గోమాంసం ఉండేదని, జంతువుల వధ ఉండేదని చేసిన అసత్య ఆరోపణలు అన్నీ బహిర్గతం చేశాము. అవి తప్పని నిరూపించే బోల్డన్ని సాక్షాలు ఇచ్చాము.

- వేదాలలో అమాయక జీవాలను హింసించుట వధించుటకు ఎటువంటి అనుమతి లేదు.
- వేద యజ్ఞాలలో ఎటువంటి జంతు హింసకు, జంతు బలికి ఆస్కారం లేదు. అది కచ్చితంగా వేద సూత్రాలకు విరుద్ధం.
- వేదాలలో గోమాంసం ఉందన్న అసత్య ఆరోపణలకు విరుద్ధంగా ఆవులను రక్షించాలని, హానిచేయని ఉపయోగకరమైన ఆవు

జాతిని అసలు చంపవద్దని చెప్పిన అనేక సందర్భాలున్నాయి.

మా పరిశీలన, పరిశోధన www.agniveer.comలో ప్రచురించిన తరువాత వేదాలపై అసత్య అపవాదులు పదును తగ్గింది. అయినా ఇంకా అడపా తడపా, తాడూ బొంగరం లేని, పనిగట్టుకుని కుతంత్రాలతో పాశ్చాత్యులు రాసిన వేద అనువాదాలు మనతో వాదనలకు తీసుకొస్తుంటారు.

కాబట్టి ఈ అధ్యాయంలో నేను ఇటువంటి కొన్ని ఆరోపణలకు బదులు ఇస్తాను. తద్వారా ఈ మొదటి రెండు అధ్యాయాలు భవిష్యత్తులో ఎవరైనా వేదాలపై చేసే దుష్ప్రచారాలను కడిగి పడేయటానికి పనికొస్తాయి. ఈ అధ్యాయం చివరలో కావాల్సిన ప్రస్తావన లన్నీ పొందుపరుస్తాను.

## 1
## యజ్ఞాలలో జంతుబలి తప్పనిసరి.

వేదాలలో జంతుబలి ఉన్న విషయం అందరికీ తెలిసిందే. వేదమంతా యజ్ఞాలను కీర్తిస్తూ ఉంటుంది.

యజ్ఞం అన్న పదం 'యజ్' అన్న మూలం మరియు నన్ అన్న ప్రత్యాయ పదం చేర్చగా వచ్చింది. యజ్ మూలానికి మూడు అర్ధాలు ఉన్నాయి.

- దైవపూజ ( చుట్టూ ఉన్న పరిధిలో ఉత్తమంగా నడుచుకోవటం - ఈశ్వరుని ఆరాధించడం, తల్లిదండ్రులను గౌరవించడం, సృష్టిని పరిరక్షించటం ఇలా కొన్ని అర్ధాలు.)
- సంఘటితం.
- దానం.

వేదాల ప్రకారం ఇవన్నీ మనుష్యుల ప్రాథమిక కర్తవ్యాలు. అందుకే యజ్ఞం యొక్క ప్రాముఖ్యత వేదాలలోనే కాక ప్రతీ పురాతన భారతీయ సాహిత్యంలోనూ కనిపిస్తాయి.

వాస్తవాలు ఎలా ఎన్ని ఉన్నా, మనం తీసుకోవాల్సిన ముఖ్య విషయం

ఏంటంటే యజ్ఞం కోసం జంతుబలి గురించిన ప్రస్తావన ఒక్కటి కూడా లేదు. అసలు నిరుక్త (వేద నిఘంటువు) 2.7 సూటిగా చెప్తోంది యజ్ఞంని అధ్వర అని పిలిచేవారు. ధ్వర అంటే హింస. అధ్వర అంటే అహింస. యజ్ఞాలలో హింస పూర్తిగా నిషేధించబడింది.

ఇంకో మాటలో చెప్పాలంటే, జంతు బలి సంగతి వదిలేయండి

అసలు మదిలో కాని, శరీరంలో ద్వారా కానీ, మాట ద్వారా కానీ ఎటువంటి హింసను చేయకూడదని చెప్పి, నిషేధించబడింది.

చాలా మటుకు, వేద మంత్రాలలో అధ్వర అంటే యజ్ఞం.

ఉదాహరణకు:

ఋగ్వేదం 1.1.4

ఋగ్వేదం 1.1.8

ఋగ్వేదం 1.14.21

ఋగ్వేదం 1.128.4

ఋగ్వేదం 1.19.1

అధర్వణ వేదం 4.24.3

అధర్వణ వేదం 18.2.2

అధర్వణ వేదం 1.4.2

అధర్వణ వేదం 5.12.2

అధర్వణ వేదం 19.42.4

ఇంకా 43 మంత్రాలు యజుర్వేదంలో అధ్వరను సూచిస్తాయి.

ఇంకా యజుర్వేదం 36.18 సూటిగా చెప్తోంది 'నేను అందరి సంరక్షణ చూస్తాను- సర్వాణి భూతాని (మనుషులను మాత్రమే కాదు.)'

కనుక వేదాలు ఎక్కడా జంతుబలిని సమర్థించడం చేయలేదు. పైగా అమాయక మూగజీవాలపై ఎటువంటి హింసను అయినా ఖండించింది.

చరిత్రలో కొన్ని సార్లు జంతుబలి జరిగి ఉండవచ్చు. కానీ దానికి వేదంలోని సమాచారానికి ఎటువంటి సంబంధము లేదు.

చాలామంది ముస్లిం అమ్మాయిలు అబ్బాయిలు అసభ్యకరమైన మోడళ్ళుగా మరియు నటీమణులుగా సినీ పరిశ్రమలో పనిచేస్తున్నారు. అసలు బాలీవుడ్ ఉన్న ప్రముఖ నటులు, నటీమణులు అందరూ ముస్లింలే. చాలామంది అశ్లీల నటులు కూడా ముస్లింలే. అలాగని ఖురాన్ అసభ్యకరమైన అశ్లీల పనులను సమర్థించిందని కాదు. అలాగే పెళ్లికి ముందే శృంగార సంబంధాలు, వ్యభిచారం క్రైస్తవ దేశాలలో విరివిగా ఉన్నాయి. దానర్థం బైబిల్ ఇటువంటి దుర్గుణాలను చేయమని చెప్పిందని కాదు.

అలా కొన్నిచోట్ల, కొన్నిసార్లు వైదిక విలువలు తగ్గడం వల్ల జంతుబలి చరిత్రలో జరిగి ఉండవచ్చు. ఇప్పుడు మేం బహిరంగ సవాల్ విసురుతున్నాం. ఎవరైనా కనీసం ఒక్క చోట అయినా వేదాలలో యజ్ఞానికి సంబంధించి జంతుబలి ఉన్నదని మాకు చూపించండి.

## 2
## అశ్వమేధ మరియు గోమేధా యజ్ఞాలలో చంపడం.

అలాగైతే మరి, అశ్వమేధ గోమేధ యజ్ఞాల సంగతి ఏంటి?
'మేధా' అంటే చంపడమే కదా.

గత అధ్యాయాలలో చెప్పుకున్నట్టుగా మేధ అంటే నరకటం అని కాదు. జ్ఞానసముపార్జనకు చేసే కార్యాలు వంటివి. మేధా యొక్క మూలం మేధ్రు సం-గ-మే (ధాతుపదం) నుంచి వచ్చింది కనుక పెంపొందించడం, సమూపార్జన అని మూల అర్థం.

మనకి ముందే యజ్ఞం అంటే అధ్వర అని, అహింస అని తెలిసినప్పుడు మనమెందుకు 'మేధ' అంటే హింస అనో, చంపడం అనో తీసుకోవాలి?

మనం జ్ఞానవంతులు మేధావి అని పిలుస్తాం కదా. మన భారతదేశంలో ఆడపిల్లలకు మేధా అని పేరు పెడతారు కదా. అంటే దానర్థం వారంతా హంతకులనా? జ్ఞానవంతులనా? మీరే చెప్పండి.

షపథ్ 13.1.6.3 మరియు 13.2.2.3 సూటిగా చెపుతోంది.

యజ్ఞం రాష్ట్ర (దేశం కానీ, రాజ్యం కానీ ) యొక్క వైభవానికి, సంక్షేమానికి మరియు అభివృద్ధికి అంకితమైనది. దాన్నే అశ్వమేధం అని అంటారు.

అందుకే రాంప్రసాద్ బిస్మిల్, యష్ ఫక్, నేతాజీ, శివాజీ, తిలక్ లాంటి వారందరూ అశ్వమేధ యజ్ఞం చేశారు.

ఆహారం పరిశుభ్రంగా ఉంచటం కొరకు, ఇంద్రియ నిగ్రహం కొరకు, సూర్యకిరణాలు మంచి పనుల కొరకు, భూమాతను మలినాల నుంచి కాపాడుట కొరకు గోమేధ యజ్ఞం చేస్తారు.

'గా' అనే పదానికి భూమి అని అర్ధం. భూమికోసం పర్యావరణాన్ని పరి రక్షించడాన్ని గోమేధ యజ్ఞం అంటారు. (నిఘంటువు 1.1, షపథ్ 13.15.3)

## 3
## నరమేధ మరియు అజమేధ యజ్ఞాలలో వధింపులు.

### వేదాలు కూడా నరమేధ యజ్ఞంలో మనుషులను చంపడాన్ని సమర్ధించింది. మరిక అజమేధ యజ్ఞం సంగతో?

వేద సూత్రాలను అనుసరించి చనిపోయిన వ్యక్తి యొక్క దహన సంస్కారాలను జరపడాన్ని నరమేధ యజ్ఞం అని అంటారు.

ప్రజల యొక్క ఉత్పాదన పెంచడానికి అవసరమైన శిక్షణ ఇవ్వడానికి చేసే అంకితమైన శ్రమను కూడా నరమేధ యజ్ఞం లేదా పురుషమేధ యజ్ఞం లేదా న్రియజ్ఞ అని అంటారు.

'అజ' అంటే దినుసులు. 'అజ' మీద యజ్ఞం అంటే వ్యవసాయ ఉత్పాదన

పెంచడం, చిన్నగా చెప్పాలంటే అగ్నిహోత్రంలో దినుసులు వాడతాం కదా. (శాంతి పర్వం 337.4-5)

విష్ణుశర్మ పంచతంత్రంలో (కకోలీయంలో ) చాలా సూటిగా చెప్పారు ఎవరైతే జంతువధ యజ్ఞంలో చేస్తారో, వారు మూర్ఖులు ఎందుకంటే వారికి వేదాలు సరిగ్గా అర్థం కాలేదు. పోనీ స్వర్గానికి వెళ్లడం కోసం జంతువధని చేస్తే, మరి నరకానికి వెళ్లటానికి ఏమి చేయాలి చెప్పండి మీరు?

మహాభారతం, శాంతిపర్వంలో 2 వివరణలు ఉన్నాయి (263.6, 265.9). ఎవరయితే యజ్ఞాలలో చేపలు, మాంసం, మద్యం ఉన్నాయని చెప్తారో వారందరూ మోసం చేసే దొంగలు, నాస్తికులు, శాస్త్రాల యొక్క జ్ఞానం తెలియనివారే.

## 4
## 'హస్థిన ఆలంభతే' అనగా ఏనుగులను బలివ్వడమే.

### యజుర్వేదం 24.29 లో 'హస్తిన ఆలంభతే' అని ఉందిగా, అంటే మరి ఏనుగులను బలి ఇచ్చినట్లే కదా?

ఆలంభ అన్న పదం 'లాభ' అన్న మూలం నుంచి వచ్చింది. లాభ అంటే లాభం. అంతే కానీ చంపడం కాదు. ఈ విషయం ప్రతి భారతీయుడికి తెలుసు. వారి దుకాణాల ముందు 'శుభ లాభ' అని రాసుకుంటారు. హస్థిన అంటే ఇంకా లోతైన అర్థం ఉంది. అయినా ఏనుగు అనే అర్థమే తీసుకుందాం. అయితే ఏం అయింది? ఈ మంత్రం ఏమని చెబుతోంది? తన సామ్రాజ్యం కోసం రాజు మాత్రమే ఏనుగులను పోషించాలని ఉంది. ఇందులో అసలు హింస ఎక్కడ ఉంది?

'ఆలంభ' అనే పదం లాభం అని చాలాచోట్ల ఉంది ఉదాహరణకు మనుస్మృతిలో బ్రహ్మచారులకు ఆడవారిపై కామం ఉండకూడదని చెప్పింది. "వర్జయేత్ స్త్రీనం ఆలంభం".

కనుక ఆ ప్రస్తావన పూర్తిగా అసంబద్ధం అయినది. వేద మంత్రాలలో 'ఆలంభతే' అంటే చంపడం అని చెప్పిన వారు బహుశా వారికి

జంతువులను చూడగానే వాటిని చంపితే వచ్చే లాభాలు స్ఫురిస్తాయి కాబోలు.

## 5
## 'సంజ్ఞాపన్' అంటే బలి.

మరి బ్రహ్మణ గ్రంధాలలో 'సంజ్ఞాపన్' అన్న పదం వాడారు కదా.
మరి దానర్థం బలి కాదా?

అధర్వవేదం 6.10.94-95 మేధ, శరీరం మనసు యొక్క 'సంజ్ఞాపన్' చేయమని చెప్తుంది. మరి దానర్థం మనమంతా ఆత్మహత్య చేసుకోవాలనా??

'సంజ్ఞాపన్' అంటే నిశ్చితంగా ఏకం మరియు పాలించడం. ఆ మంత్రం మనకేం చెబుతోందంటే మనసా, శరీర, బుద్ధి ఇవన్నీ ఏకరీతిన పనిచేయాలని చెప్పింది. 'సంజ్ఞాపన్' అంటే చెప్పడం అని కూడా అర్థం.

## 6
## యజుర్వేదం, ఋగ్వేదాలలో అశ్వాలను బలివ్వడం ఉంది కదా.

ప్రతిసారీ ఏదో ఒక వివరణ ఇచ్చి తప్పించుకుంటున్నారు. ఈసారి
తప్పించుకోలేరు. యజుర్వేదం 25.34-35/ఋగ్వేదం 1.162.11-12
ఏమని చెప్తున్నాయి అంటే:

యత్తే గాత్రాదగ్నినా పచ్యమానాదభి శూలం నిహతస్యావధావతి
మా తద్భూమ్యామాశ్రిషన్మా తృణేషు దేవేభ్యస్తదుశద్భ్యో రాతమస్తు.

ఇందులో చాలా స్పష్టంగా గుర్రాలను బలి ఇవ్వమని ఉంది కదా.

కానే కాదు. అవన్నీ విదేశియుడైన గ్రిఫిత్ రాసిన పనికిమాలిన రచనలు.

దీనిలో అసలు గుర్రం యొక్క ప్రస్తావన అసలు లేనే లేదు. జ్వరంతో పీడించబడుచున్నపుడు వైద్యులతో రోగము నయము చేసుకొనవలెను అని ఉంది.

యే వాజినం పరిపశ్యన్తి పక్వం య ఈమాహుః సురభిర్నివారరేతి
యే చార్వతో మాం సభిక్షాముపాసత ఉతో తేషామభిగూర్తిర్న ఇన్వతు

వాజినం అంటే గుర్రం ఒక్కటే అని అర్థం కాదు. ధైర్యమైనది, బలమైనది, చంచలమైనది అని కూడా అర్ధం. ఎన్ని పర్యాయపదాలు ఉన్నప్పటికీ ఒక్కటి కూడా గుర్రం యొక్క బలిదానాన్ని సూచించలేదు.

ఒకవేళ మనం గుర్రం అర్థం తీసుకున్నప్పటికీ ఎవరైతే గుర్రం మాంసం బాగుంటుందని కీర్తిస్తారో, ఎవరైతే గుర్రాన్ని పొంది దానిని చంపవచ్చునని చెప్పారో వారి భావం గ్రహించి వారిని అలా చేయకుండా నిలువరించండి అని అర్ధం. ఇటువంటి సందేహాలు వచ్చినప్పుడు స్వామి దయానంద సరస్వతి వారు అనువదించిన మంత్రాలను మనం పరిశీలించుకోవాలి.

అయినా ఈ మొదటి అధ్యాయంలో మనం పరిశీలిస్తే చాలా మంత్రాలు జంతుబలిని నిషేధించడమే కాక ప్రత్యేకంగా గుర్రాలను, ఆవులను వాధించేవారిని శిక్షించండి అని ఉంది.

## 7
## అతిథిఘ్న- అతిథులకు గోమాంసం వడ్డించే వాడు.

మరి వేదాలలో ఉన్న గోఘ్న (గోవును వధించుట) మాటేమిటి?
మరి అతిథిగ్వ/అతిథిఘ్న / అతిథులకు గోమాంసం వడ్డించే వాడు ఈ ప్రస్తావనలు ఏమిటి?

గత అధ్యాయంలో గోవుకు సంబంధించిన అఘ్న్య / అదితి ప్రస్తావనలను ఇలా చాలా ఇచ్చి ఉన్నాము. గోవులను నాశనం చేయడానికి ప్రయత్నించే వారికి కఠినమైన శిక్షలు వేయాలన్న ప్రస్తావనలు చదివాము.

'గమ్' మూలం 'వెళ్ళడం' అందుకే గ్రహాలు అనే పదంలో 'గ' ఉంటుంది. ఎవరైతే అతిథుల దగ్గరకు వెళ్లి చిత్తశుద్ధితో సేవిస్తారో వారిని అతిథిగ్వ/

అతిథిఘ్న అని అంటారు.

'గోఘ్న' చాలా అర్థాలు ఉన్నాయి. గో అంటే గోవు అని తీసుకొన్నా 'గోఘ్న' అంటే గో+హన్ అంటే గోవును సమీపించుట అని అర్థం. (హన్ మూలార్థం హింసే కాకుండా కదలిక లేక జ్ఞానం అని కూడా అర్థం ఉంది)

ఉదాహరణకు అధర్వ వేదంలో భర్త అనే వాడు 'హన్' - భార్యను సమీపించేవాడు అని ఉంది. కాబట్టి ఇలాంటి ఆరోపణలు అన్నీ ఆధారాలు లేని, పస లేని వాదనలే.

## 8
## ఒట్టి పోయిన ఆవులను ఎద్దులను చంపాలి.

వేదాలు ఆవు యొక్క లేగదూడలను చంప వద్దు అని అన్నది కానీ ఒట్టిపోయిన (వషా) ఆవులను కాదు. యుక్ష / ఎద్దులను చంపాలి అని వేదాలలో ఉంది.

ఈ పరికల్పన బాగా ప్రచారం లోకి వచ్చింది. కుహానా మేధావి అయినా డి.న్.జా గోమాంసంపై వేదాలకు విరుద్ధమైన ప్రతిపాదనలు తెచ్చి మన సంస్కృతి వెన్ను పోటు పొడుస్తుంటె ఇక మనకీ వేరే పరాయి దేశం నుంచి ప్రత్యేక శత్రువులు ఎందుకు చెప్పండి.

అసలు విషయం ఏంటంటే 'యుక్ష' అనే పదం మూలికా వైద్యానికి సంబంధించింది. దీనినే 'సోమ' అని కూడా అంటారు. మునీర్ విలియమ్స్ తన సంస్కృత ఆంగ్ల నిఘంటువులో కూడా ఇదే రాశారు. 'వశా' అంటే వశం చేసుకొనే చేసుకునే దేవతా శక్తి అనే కాని 'వట్టి పోయిన ఆవు' అని కాదు. అదే నిజమైతే వేదాలలోని చాలా పద్యాలు అర్థం లేనివిగా ఉంటాయి.

ఉదాహరణకు అధర్వ వేదం 10.10.4 లో 'వశ'కి సంబంధించి 'సహస్రధర' / వేలదారులు వంటివి ఉన్నాయి. ఎలా వట్టిపోయిన ఆవుని లెక్కలేనంత ఆహారం పాలు మరియు నీరు అనే అర్థం ఉన్న 'సహస్త్రధర'తో పోల్చారు.

అధర్వ వేద 10.190 లో 'వశీ' అంటే లోబరుచుకుని కట్టడిచేసే దేవతాశక్తి అనే అర్థం. దీనిని రోజుకు రెండుసార్లు వేద సంధ్యావందనంలో వాడుతారు.

ఇంకా వేరే పద్యాలలో 'వశ' ఉత్పాదక భూమి అని లేదా మంచి భార్య పిల్లలు (అధర్వణవేదం 20.103.15)అని సూచించేవారు. మోనీ రిలియన్స్ కూడా ఆ పదాన్ని మూలికా అని తన నిఘంటువులో పేర్కొన్నాడు.

మరి నాకర్థం కానిది ఏంటంటే ఏ దైవ ప్రేరణతో ఈ కుహనా మేధావులు 'వశ' అనే పదానికి 'వట్టిపోయిన ఆవు' అని ఊహాగానాన్ని జతచేశారంటారు?

## 9
## దంపతులు మాంసాహారం తినాలి.

బ్రిహదరన్యక ఉపనిషత్తు 6.4.18 లో సుపుత్రుడు జనించాలంటే దంపతులు అన్నంలో మాంసం కలిపి (మంసోదనం) లేదా ఎద్దు మాంసం (అర్షభ) లేదా దూడ మాంసం (యుక్ష) తినాలి.

వేదాలలో మాంసాహారం ఉన్నదన్న వాదన చూపించలేక ఇప్పుడిక ఆరోపణలు ఉపనిషత్తులపై మళ్లించ బడ్డాయి. ఒకవేళ ఉపనిషత్తుల్లో గోమాంసం ఉన్నదని నిరూపించినప్పటికీ, వేదాలలో కూడా గోమాంసం ఉన్నదని అయితే మాత్రం నిరూపించలేరు. హిందూత్వానికి ఏ మూలాధారం వేదాలు, అవి ఉత్తమ ప్రమాణము.

పూర్వ మీమాంస 1.3.3 , మనుస్మృతి 2.13, మనుస్మృతి 12.95 , జబలస్మృతి, భవిష్యపురాణం లలో సూటిగా చెప్పారు ఏమని ఒకవేళ వేదాలకు మరియు ఇతర శాస్త్రాలకు మధ్య ఏమైనా స్వల్ప విరుద్ధాలు వస్తే అప్పుడు వేదాలనే ఉన్నత ప్రమాణంగా స్వీకరించాలి, మిగతావన్నీ త్రుణీకరించాలి.

ఇలా చెప్పినప్పటికీ బృహదరణ్యక ఉపనిషిత్తులో వక్రీకరించిన విషయాలు పరిశీలిద్దాం.

మొదట 'మంసోదనం' తీసుకొందాం. ఈ పద్యం కంటే ముందు మరో నాలుగు పద్యాలలో దంపతులు పిల్లలను కనడానికి ఎటువంటి ఆహార పదార్థాలు తినాలి అని సూచించారు.

ఆ ఆహార పదార్థాలేమంటే,

- క్షీరోదనం ( పాలన్నం )
- దాధ్యోదనం ( పెరుగన్నం)
- గెంజి అన్నం ( నీళ్ళన్నం )
- తృణధాన్యం ( పప్పన్నం )

అధర్వ వేదంలో మంసోదనం (మాంసంతో అన్నం) ఉండటం నిజంగా ఒక ప్రత్యేకమైన విశేషమే. ఒక భావ ప్రవాహంలో ఇటువంటి అసందర్భమైన మలుపు చెబుతోంది ఇది కచ్చితంగా విపరీతమైనదని.

నిజానికి సరైన పదం మషోదనం కానీ మంసోదనం కాదు. 'మష' అంటే ఒక దినుసు. కనుక అది కండకి సంబంధించినది కాదు. పైగా గర్భిణీ స్త్రీలు మాంసాహారం పూర్తిగా నిషేధించాలని ఆయుర్వేదంలో ఉంది కావాలంటే 'శుశృత సంహిత' చూడండి. శుశృత సంహితలో ఒక వాక్యం 'మష' తినమని భార్యాభర్తలకు చెబుతోంది. కాబట్టి 'బ్రిహదరణ్యక ఉపనిషత్తులో' ఇదే విషయాన్ని మరింత స్పష్టంగా 'శుశృత సంహితలో' చెప్పారు. కాబట్టి 'మష', 'మంస' అనే రెండు పదాల యొక్క అర్థాలు విడివిడిగా ఉండాల్సిన అవసరం లేదు.

ఒకవేళ ఎవరైనా 'మష' , 'మంస' వేరని చెప్పినప్పటికీ 'మంస' అంటే 'గుజ్జు' అనే అర్థం అంతేకానీ మాంసం అని కాదు కదా.

మన పురాతన గ్రంథాలలో 'మంస' అంటే గుజ్జు అనే అర్థం వచ్చేలాగా అనేక చోట్ల ప్రస్తావించారు.

ఉదాహరణకు, 'అమ్రమంసం' అంటే మామిడి గుజ్జు. 'ఖర్జూరమంసం' అంటే ఖర్జూరపండు యొక్క గుజ్జు. మరిన్ని ప్రస్తావనలు కావాలంటే చరక సంహిత చదవండి. తైత్రియ సంహిత 2.32.8 లో 'మంస' అనే పదం

పెరుగు, తేనె మరియు మొక్క జొన్న వాటికి వాడారు.

ఇప్పటికే మనం 'యుక్ష' అంటే మూలిక లేదా సోమ అని 'మోనీర్ విలియమ్స్' నిఘంటువులో చూసాము. అదే నిఘంటువు రిషభ్ ( అర్షభ అనే మూలం నుంచి వచ్చింది) అంటే ఔషధ మొక్క( కార్పోపోగన్ ప్రురీన్స్). చరక సంహిత 1.4-13 రిషభ్ ను ఔషధ మొక్కగా సూచించింది. ఇదే విషయాన్ని శుశ్రుత సంహిత 38 లో మరియు భవప్రకాష్ పూర్ణకాండం ఆయుర్వేద ప్రతులలో చెప్పబడింది.

కొంచెం ముందుకు వెళ్తే 'అర్షభ్' మరియు 'యుక్ష' యొక్క రెండిటి అర్ధం 'ఎద్దు'. అంతేకానీ 'లేగదూడ' అని కాదు. మరి ఒకే పర్యాయపదాలు 'బ్రిహదరన్యక'లో ఒకే శ్లోకంలో పక్కపక్కనే ఎందుకు వాడారు? ఇది ఎలా ఉందంటే పెరుగు లేదా దధి (curd) తినండి అన్నట్లు ఉంది. లేదా ఒకరు 'కలకత్తా' కానీ, 'కోల్ కొత్త' కానీ వెళ్ళండి అన్నట్లు ఉంది.

ఉచితంగా ఈ రెండు పదాలు వేరు వేరు అర్థాలే. మిగతా ఇతర వాక్యాలు క్రమంలో చూసినట్లయితే ఈ మూలికలు పెరుగు సూచిస్తున్నప్పుడు తరువాతి పదం కూడా శాఖాహారానికి సంబంధించినదే అయ్యి ఉండాలి కదా. అలాకాకుండా డిన్ జా కో, ఖట్టు కో ఆవులను చంపటం ఇష్టమని ఆ పదాలను మాంసము అనో గోమాంసము అనో అనలేము కదా.

## 10
## మహాభారతం వన పర్వం 207 లో గోహత్య.

మహాభారత వనపర్వం 207 చెప్తోంది రంతిదేవ రాజు యజ్ఞాలు చేసేవాడని పెద్ద ఎత్తున గోవులను వధించేవాడని, మరి దాని సంగతి ఏమిటి?

ఇంతకుముందే చెప్పినట్టు ఒకవేళ వేదానికి, మరొక శాస్త్రానికి మధ్య వైరుధ్యం కనిపిస్తే వేదాలనే అత్యున్నత ప్రామాణికంగా తీసుకోవాలి. పైగా మహాభారతం చాలా మటుకు అంతర్వేశనం చెందినది కాబట్టి ప్రక్షిప్తాలతో కూడిన దానిని వేద ప్రమాణిక సమానంగా తీసుకోలేము. రంతిదేవ దగ్గర

జరిగిన గోహత్యలకు సంబంధించిన అసత్య ఆరోపణలను చాలా మంది పండితులు కొన్ని శతాబ్దాల క్రితమే ఖండించారు.

- 'అనుషాసన్ పర్వ' 115 మాంసం ముట్టని రాజులలో రంతిదేవ ఒకడని చెప్తోంది. గోమాంసం విరివిగా లభించిన యెడల ఇలా ఎలా చెప్పగలరు?
- ఇంతకుముందే మనము నిరూపించాము 'మంస' అంటే మాంసం కాదని 'గుజ్జు' అనే అర్థం కూడా ఉందని.
- ఆ శ్లోకం ప్రతిరోజు 2000 గోవులను వధించేవారని చెప్తోంది. అంటే సుమారుగా సంవత్సరానికి 7,20,000 ఆవులను చంపే వారట కనుక ఇలాంటి మనం శ్లోకాలను తీవ్రమైనవిగా పరిగణించకూడదు.
- మహాభారతం శాంతిపర్వం 262.47 ఎవరైతే గోవును కానీ, ఎద్దుని కానీ చంపుతారో, వారంత పాపాత్ములుగా పేర్కొంది. అదే మహాభారతం రంతిదేవ రాజును గొప్ప సన్యాసిగా, పవిత్రమైన మనిషిగా పిలుస్తుంది. మరి ఇంత పరస్పర విరుద్ధమైన వ్యాఖ్యానాలు ఒకే మహాభారతంలో ఎలా ఉన్నాయి.
- నిజానికి దారితప్పిన రాహూల్ సంక్రిత్యాయన లాంటి మేధావులు శ్లోకాలను వక్రీకరించారు. ఇతనికి వేదాలంటేనే కంటగింపు. రాహూల్ సంక్రిత్యాయన ద్రోణపర్వం లోని అధ్యాయం 67 లో కేవలం 3 వాక్యాలు మాత్రమే పేర్కొని కావాలని తరువాత వాక్యం వదిలేశాడు. అతను 'ద్విష్టాసహస్ర'ను 2000గా తప్పుగా పేర్కొన్నారు అసలు అది 200 వేలు. (ద్వి-రెండు, షట్- వంద, సహస్ర -వేయి).

దీన్ని బట్టి అతనికి సంస్కృతంలో ప్రావీణ్యం లేదు అని తెలుస్తోంది. వీటిలో ఒక్క వాక్యం కూడా గోమాంసం కు సంబంధించినది లేదు. అతను వదిలేసిన నాలుగో వ్యాక్యం మనం కలిపి చదివితే అర్థం ఇలా ఉంటుంది. రంతిదేవ అనే రాజు 2,00,000 వంట వాళ్లను తన రాజ్యంలో పెట్టుకున్నాడు వారు రాత్రనకా పగలనకా వచ్చే అతిథులకు, పండితులకు మంచి ఆహారం (అన్నం, తృణధాన్యాలు, వండిన వంటకాలు,తీపిపదార్థాలు)

సమకూర్చేవారు. తర్వాత 'మష' అనే పదాన్ని 'మంస'గా మార్చి మనకు గోమాంసం గురించి అనే భావన వచ్చే లాగా చేశారు.

- మహాభారతంలో అహింస, గోమాంసం నిషేధంకి సంబంధించిన తగినన్ని పద్యాలు ఉన్నాయి. పైగా గోదానం, గోసంరక్షణ వంటి వాటిని పొగిడాయి.
- మూర్ఖులు మాత్రమే 'బద్యతే' అనే పదాన్ని చంపడం అనే అర్ధంలో తర్జుమా చేయగలరు. సంస్కృత వ్యాకరణం, వాడకం ప్రకారం అసలు అర్దం 'నియంత్రణ' అని అర్థం.

కాబట్టి ఏ విధంగా చూసినా రంతిదేవ అనే రాజు ఆవులను చంపాడు అనటానికి ఎటువంటి ఆధారాలు లేవు.

## సారాంశం

గోమాంసంపై అసత్య ఆరోపణలు, వేదాలలో గోమాంసం ఉందనే రచనలు చేసి హిందూ తత్వంపై ప్రపంచానికి వక్రీకరించి ద్వేషం పెంచేలా చేశారు అని తేల్చి చెప్పవచ్చు.

ఈ జ్ఞాన వెలుగు వారి మెదడుకు పట్టిన మకిలిని కడిగివేస్తుందని, ఈ ప్రపంచం ప్రతి ఒక్క ప్రాణి సంతోషంగా నివసించటానికి తగిన వాతావరణం సృష్టిస్తుందని భావిస్తున్నాము.

## గ్రంథ పఠనం


- ఋగ్వేద భాష్యం, ఋగ్వేదంపై వ్యాఖ్యానం- స్వామి దయానంద సరస్వతి.
- యజుర్వేద భాష్యం, యజుర్వేదంపై వ్యాఖ్యానం- స్వామి దయానంద సరస్వతి.
- నో బీఫ్ ఇన్ వేదాస్-బి.డి.యుకుల్.
- వేదోం కా యదార్ధ్ స్వరూప్.- పి.టి. ధర్మదేవ విద్యావాచస్పతి.

- ఆల్ యువర్ వేద సంహిత- పిటి దామోదర్ సత్వలేకర్.
- ప్రాచీన్ భారత్ మే గోమాంసం, ఒక సమీక్ష. గీతా ప్రెస్ ,గోరఖ్ పూర్.
- ద మిత్ ఆఫ్ హోలీ కౌ- డి.న్.జా.
- హైమ్స్ ఆఫ్ అధర్వేద- గ్రిఫ్త్.
- సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ఈస్ట్-మాక్స్ ముల్లర్.
- ఋగ్వేద ట్రాన్స్ లేషన్స్- విలియమ్స్ జోన్స్.
- సాంస్క్రిట్ ఇంగ్లీష్ డిక్షనరీ- మోనీర్ విలియమ్స్.
- కామెంటరీ ఆన్ వేదాస్ . దయానంద్ సంస్థాన్.
- వెస్ట్రన్ ఇండాలిజిస్ట్, ఎ స్టడీ ఆఫ్ ఆఫ్ మోటివ్స్. - పి.టి. భగవదత్త్.
- సత్యార్థ్ ప్రకాశం -స్వామి దయానంద సరస్వతి.
- ఇంట్రడక్షన్ టు వేదాస్-స్వామి దయానంద సరస్వతి.
- క్లౌడ్ ఓవర్ అండర్ స్టాండింగ్ ఆఫ్ వేదాస్. -బి.డి.యుకుల్.
- షత్ పత్ బ్రహ్మన్.
- నిరుక్త - యాస్కాచార్య.
- ధాతుపద్- పాణిని.

అధ్యాయం 3

# గోమాంస ప్రియుల అమాయక ఆలోచన తప్పేందుకంటే

సత్యం కేవలం అజ్ఞాన మార్గులనే బాధిస్తుంది.

-అగ్నివీర్

మహరాష్ట్రాలో గోమాంస నిషేధంపై సామాజిక మాధ్యమాలలో భీకరంగా ఏకరువులు పెట్టారు. ఇది వారి వ్యతిగత స్వేఛ్ఛపై దాడిగా వర్ణించారు. ఈ అధ్యాయంలో నేను గోమాంస నిషేదాన్ని బలపరుస్తూ దీని వల్ల దేశానికి ఎంత మేలో చెప్తాను. అంతేకాక గోమాంస నిషేధం ప్రజాస్వామ్యమేనని, తార్కికమేనని, రాజ్యాంగ బద్ధమేమని నిరూపిస్తాను.

గోమాంస ప్రియుల వాదన ఇలా ఉంటుంది

“నేనేం తినాలో అది నాయిష్టం. నేను ఏది తినాలో ఏది తినకూడదో చెప్తూ నైతికత పేరుతో నాపై అజమాయిషీ చేయడానికి ఈ ప్రభుత్వం ఎవరు?

నేనెదిరించానని రేపొద్దున్న తోటకూర, వంకాయ కూడా నిషేదిస్తారా? ఇలాంటి మత రాజకీయాల్ని, హిందూ మత ఛాందసవాదాన్ని ఖచ్చితంగా ఎదిరించాలి."

వారలా అంటూంటే నిజమే కదా అనిపిస్తుంది, కాబట్టి అలా పైపై మాటలు కాకుండా ఈ గోమాంస నిషేదంపై కొంచెం లోతుగా పరిశీలిద్దాం పదండి.

నేను ఈ 13 విషయాలతో వారి నోళ్ళు మూయించగలను. గోమాంస ప్రియులు కనుక వీటిల్లో ఒకటో, రెండో తోసిపుచ్చి వారంటున్న వాదన నిజమని కనుక వాదిస్తే, మొత్తం 13 విషయాలు తప్పని నిరూపించనిదే వారి వాదన నిలబడదని మీరు వారికి స్పష్టం చేయండి. ఇది ఎలా ఉంటుందంటే ఒక వ్యక్తి 20 మందిని హత్య చేశాడని నేరం మోపబడితే అందులో 3 హత్యలు ఎవరో చేశారని నిరూపితమైంది కనుక నిందుతుడిని ఉరికంబం నుంచి ఎలా తప్పించరో ఇదీ అంతే.

## 1
## గోమాంస నిషేదంపై గతంలో కదలిక ఎందుకు లేదు?

గోహత్య, ఇతర పశువుల హత్యలపై నిషేదం ఎప్పటి నుంచో భారతదేశంలో ఉంది.

మరి ఇన్నాళ్ళు ఏమి తిన్నారు. ఏమైనా అసాంఘిక పనులు చేసి కప్పి పుచ్చారా? గత 7 దశాబ్దాలుగా గోమాంసం లేకపోతే ఉండలేమని ఎప్పుడూ గొడవ చేయలేదే? 68 ఏళ్ళు నిద్రపోయారా? కుంభకర్ణుడు కూడా ఇంతలా నిద్రపోడే?

## 2
## గోమాంసం తినడంపై నిషేదం లేదు కానీ గోహత్యపై నిషేదం ఉంది.

నువ్వు ఏం తింటావో ఏం తినవో అన్నదానిపై మాకు సమస్య లేదు. నువ్వు ప్రజాస్వామ్యంలో పాకీ దొడ్డి నుంచి కూడా తినొచ్చు. కాబట్టి

తినడంపై నిషేదం లేదు, కానీ పశువులను చంపడంపై నిషేదం ఉంది.

ఆవును చంపడం నాలాంటి వాళ్ళకు అభ్యంతరకరం. ఆమాటకొస్తే పశువులన్నింటినీ. నువ్వు తల్లి లాంటి నా ఆవును చంపకుండా గోమాంసంని ప్రయోగశాలలో సృష్టించగలిగితే నాకెటువంటి అభ్యంతరం లేదు.

కానీ ప్రజాస్వామ్యం పేరుతో నా తల్లిని చంపుతానంటే నువ్వు వేరే దేశం వెతుక్కో. సోమాలియా పోతావో, ISIS ప్రాంతాలకు వెళ్తావో నీ ఇష్టం. కానీ పుట్టలో చేయి పెడితే కుట్టకుండా మాత్రం ఉండను !

## 3
## ఆవు నా తల్లి.

అవును ఆవు నాతల్లే, నాకే కాదు ఈ భారతదేశంలో మూడొంతుల మందికి ఆవు తల్లి లాంటిదే. ఇంచుమించు ఇదే భావోద్వేగం అందరిదీ. శ్రీకృష్ణుడు ఆవు రక్షకుడిగా ( గోపాలుడిగా) తనకున్న ప్రీతిని మనకు చూపారు. మనం ప్రతీ సందర్భంలోనూ పుట్టినరోజు, పండుగరోజు, విచారం లోనూ చావులోనూ గోమాతకు పూజిస్తాం, సేవ చేస్తాం అది మన ప్రాథమిక విధి. ఆవు కోసమే ప్రత్యేకమైన పండుగలూ ఉన్నాయి. ఇదే గౌరవ, సాంప్రదాయం మిగతా పశువులకూ వర్తింపజేశాం. ఎద్దు శంకరుని సహచర్యంలో ఉండడం గుర్తిస్తాం.

ఆవుని పూజించడం నువ్వు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా మూడొంతులు పైనా భారతీయులందరూ మాత్రం ఆవుని వారి తల్లిగా భావిస్తారు. వారి తల్లి చంపడానికి ఒప్పుకోరు. ఊహించు ఒకవేళ నేను ఒక జంతువుపై మీ అమ్మ పేరు రాసి చంపాననుకో, పోనీ హిందూ దేవదేవతల పేరో, మహ్మద్ ప్రవక్తో లేక జీసస్ క్రీస్తు పేరో పెట్టి చంపితే ఎలా ఉంటది? నేను గుడినో, మసీదునో, చర్చినో నాశనం చేస్తే నువ్వు ఊరుకోగలవా?

అలాచేస్తే నువ్వు కిరాతకుడివే. అది పక్కన పెడదాం. మొదట అస్సలు ఇలాంటివి విడియోలు తీసి యూట్యూబ్ లాంటి అంతర్జాలాలలో

- పశ్చిమబెంగాల్లోని తుక్-టుకి కమండలంలో ఒక హిందూ మైనర్ బాలికను ముస్లిం గుండాలు ఎత్తుకుపోయి నప్పుడు మీడియాలో ఒక్క కథనం రాలేదు.
- కొన్ని నెలల క్రితం బెంగాల్లో ఒక క్రైస్తవ సన్యాసిపై సామూహిక అత్యాచారం జరిగినప్పుడు మీరంతా తెగ గొడవ చేశారు. హిందూ మతతత్వం మైనారిటీలను తొక్కేస్తున్నారాని నానా యాగీ చేశారు. ఎప్పుడైతే ఆ నేరం చేసిన వారంతా బంగ్లాదేశ్ కు చెందిన ఇస్లాము మతవాదులని తెలిసిందో అప్పట్నుంచి ఉన్నపళంగా ట్వీట్లు, ప్రెస్ కవరేజ్, టీవీ రిపోర్టు అన్ని ఆగిపోయాయి. మీ చేతలు ముస్లిం వర్గంలోని మత తత్వ వాదులకు ఊతంగా ఉంది. మతవిద్వేషాలు పెరగటానికి మీరే ముఖ్య కారణం.

## 15
## దాద్రి మరణాలను ఖండిస్తూ ట్వీట్లు చాలానే చేశాము కదా.

అగ్నివీర్:

- మీరు చేసే ట్వీట్లు ఆ చంపేవారు చదువుతారు అనుకుంటున్నారా?
- అసలు నిజం ఏంటంటే మీరు ఆ ట్వీట్లు రాసేది చంపే వారి కోసం కాదు అగ్నివీర్ లాంటి హిందూ సహనపరుల కోసం. ఆవులను ప్రేమించే మేము అటువంటి హంతకుల మని మీయొక్క అజ్ఞానపూరిత ఊహలు. ఆ సంఘటనను అవకాశంగా తీసుకుని నా తల్లిని తినాలని, హిందువులను తూలనాడుతూ నీ కామకోరికలు సమర్థించుకోవాలనుకోకు.
- మీకంత జ్ఞానోదయమే వస్తే ప్రకృతిని ప్రేమిస్తూ వాటిని సంరక్షించండి. వందకోట్ల సహచర హిందువుల మనోభావాలను గౌరవించండి.

## 16
## మీరు ముస్లింలను చంపమని రెచ్చగొడుతున్నారు.

శివాజీ కసాయి వాన్ని చేతులు నరుకుతున్న ఫోటో మీ వెబ్సైట్లో పెట్టారు. దీనివల్ల చట్టాన్ని చేతిలోకి తీసుకుని ముస్లింలను చంపమని చెబుతున్నట్టుగా ఉంది.

అగ్నివీర్:

- మీ వాదన తీసుకుంటే భగత్ సింగ్, చంద్రశేఖర్ ఆజాద్ మరియు నేతాజీ వారసత్వాన్ని కూడా రద్దు చేయమని అడుగుతున్నట్టు ఉంది. నాజూకు నాయకుల హైలెట్ చేస్తే చివరికి ఇలాంటివి బోలు వాదనలే మిగులుతాయి.

- మొఘులులు బలవంతంగా భారతదేశాన్ని దండెత్తి కలుపుకోవాలని చూసినప్పుడు ఆ రోజుల్లో శివాజీ చేసిన కార్యం కచ్చితంగా సరైనది. గో ప్రేమికులైన రాణాప్రతాప్, శివాజీ, గురు గోబింద్ మరియు మంగల్ పాండే వీరందరికీ కృతజ్ఞతలు. లేకపోతే బమియన్ బుద్ధులను అఫ్గానిస్థాన్లో ఏరివేసి నట్టుగా అయ్యేది. వారంటే మాకు గౌరవం వారి మార్గంలోనే మేం పయనిస్తామని ప్రతిజ్ఞ చేస్తున్నాం.

- మా డిస్క్లైమర్ చదవండి. మేము రాసేదంతా మా డిస్క్లైమర్ కు లోబడి ఉంటుంది. మేము అహింసకు, మతసామరస్యతకు, దయాగుణంతో మరియు ఈ దేశం యొక్క చట్టాన్ని గౌరవిస్తూ సదా నడుచుకుంటామని మరొక్కసారి చెప్తున్నాము.

- మీ వాదన ప్రకారం హింసాప్రవృత్తిని చూపిస్తున్నందుకు 90% బాలీవుడ్ సినిమాలు నిషేదించాలి. అదే నిజమైతే ఇక్కడ కోట్లాడి సమయం వృధా చేసుకోకుండా వెళ్లి సినీ పరిశ్రమపై కొట్లాడు. లేదా ఇంకోసారి హిందువులను గాని, వారి నాయకులనుకానీ, వారి నమ్మకాలకు చిహ్నాలాను అవమానపరచాలనే ధైర్యం చేయమాకు. ఒకవేళ అలా చేస్తే పర్యవసానం ఎలా ఉంటుందో యాక్షన్ సినిమాలు చూడు.

- గోమాత విషయానికొస్తే మాకు చాలా క్లారిటీ ఉంది హిందువులంతా ఏకమై వాటి రక్షణ కొరకు పని చేస్తాం. ఎట్టిపరిస్థితుల్లోనూ పవిత్ర గోమాతకు ఎటువంటి హానీ జరగదన్న నమ్మకం కుదరడానికి ఎంతకైనా తెగిస్తాం.

- దుండగులు అందరికీ గట్టి హెచ్చరిక: శివాజీ, ప్రతాప్, గురు గోబింద్, బండ సింగ్ బహుదూర్, అబ్దుల్ కలాం లే కాక మా ఏ ఇతర హీరోలను అవమానించాలన్న ఆలోచన నుంచి తప్పుకోండి. ద్వేషానికి అనవసరంగా ఆజ్యం పోయకండి. ద్వేషం మీ ఆరోగ్యంపై చాలా చెడ్డ ప్రభావం చూపగలదు.

## 17
## మీరు ఆర్ఎస్ఎస్ లాంటి మిలిటెంట్ సంస్థలను సమర్థిస్తున్నారు.

మీరు బజరంగ్ దళ్, శివసేన, విహెచ్పి, ఆర్ఎస్ఎస్ లాంటి అతివాద సంస్థలకు సమర్ధిస్తున్నారా?అసలు మిలిటెంట్ అంటే ఎవరు?

అగ్నివీర్:

హిందువులు స్వాభావికంగా విధేయులు. మాకు తెలిసి ఏ హిందూ గ్రూపు ఇంతమటుకు మిలిటెంట్ గ్రూపుగా మారలేదు. అవును మేము ఇప్పుడు అతివాద సంస్థలకు సరైన కారణంపై సహకారం అందిస్తాం తప్పుడు గ్రూపులోని తప్పుడు కారణాల కోసం ప్రచారం చేయము. ఇస్లాము అతివాదం రోజురోజుకి వృద్ధి చెందుతూ మీలాంటి ఉదారవాదులు మా హిందువులపై అణిచివేయాలని ప్రయత్నిస్తే శివాజీ, ప్రతాప్ లు పుట్టుకొస్తారు. మా బాధ్యతను రష్యా చెందిన పుతిన్ ఐఎస్ఐఎస్ పై బాంబులు కురిపించమని వదలలేము.

## 18
## మరి బాల్ఠాకరే సంగతేంటి?

అగ్నివీర్:

అతను బతికున్నంత మటుకూ ఒక్కళ్ళు కూడా బాలీవుడ్ నుంచి ధైర్యం చేయలేకపోయారు గోమాతను చంపటానికి. ఇంకా అతని ఆశీర్వచనాల కోసం ఆయన బంగళాముందు ఎదురుచూసేవారు. స్టూడియోల్లో హీరోల

నోళ్ళు మూయించాలంటే ఇలాంటి వాళ్లు మనకు ఈరోజుకు కూడా కావాలి. ఆ లోటు యుద్ధప్రాతిపదికన పూడ్చాలి.

## 19
## గోమాంస ప్రియుడు: గాంధీ కూడా గోమాంస నిషేధంపై పనిచేసేవారు.

అగ్నివీర్:

మొదట నన్ను గాంధీని అనుసరించ మంటారా లేక నేను శివాజీని అనుసరించి గోవధ చేసేవారిని నాశనం చేయ మంటారా. రెండవ పరిణామంలో మీరు మాంసం తినటం ఆపి, ఖాదిని ధరించి, విలాస వస్తువులను వాడటం ఆపి శుచిశుభ్రత ప్రచారంలో పాల్గొనండి. మీయొక్క కామ పూరిత విషాన్ని పబ్లిక్లో కక్కండి.

## 20
## ప్రాచీన భారతీయ సంస్కృతిలో గోమాంస భక్షణ సమర్ధించబడింది.

నీకు తెలీదేమో! నీ యొక్క గత చరిత్ర సంస్కృతి గురించి, నేను తింటాను. ఎందుకంటే ఈ ప్రాచీన భారతీయ చరిత్రలో గోమాంస భక్షణ అలవాటుగా ఉండేది.

అగ్నివీర్:

- ఉన్నపళంగా భారతీయ సంస్కృతిపై నీకు ప్రేమ పుట్టుకు రావటం నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. నీకు ఎప్పుడైతే శృంగారభరిత మన కోరికలు సమర్ధించాలి అనుకున్నా, మనుషుల్ని చంపుకు తినేటటువంటి మాంసభక్షణ కోరిక పుట్టినప్పుడల్లా ఈ అమాయక జీవాలను నీ కంచంలోకి తీసుకొస్తావ్.
- రాతియుగంలో మనుషులు నగ్నంగా తిరిగే వారట. ఇప్పుడు నీ

ప్యాంటు గుండీలు లూజు చేస్తావా ఏంటి?

- ప్రాచీనకాలంలో భారతదేశం ఒక హిందూ జాతి కాబట్టి ఈ దేశాన్ని హిందూ జాతిగా ప్రకటిద్దాం. ఏంటి? వద్దా? ఎందుకు? ప్రాచీనకాలంలో లాగా గోమాంస భక్షణ అనుమ తిందామంటే మరి హిందూజాతిగా ప్రకటన మాత్రం ఎందుకు తప్పు అవుతుంది? గోమాంస ప్రియులారా ఎక్కడున్నారు ఇప్పుడు?
- సరేగాని, వేదాలలో గోమాంసం తింటూ ఆనందించమని ఉందని మీరు ప్రామాణికమైన ఒక్క మంత్రం వాక్యం చూపిన అగ్నివీర్ మీ గో మాంసప్రియులు పక్షాన ప్రచారం చేస్తుంది. ఒకవేళ మీరు ఓడిపోతే శివాజీ, ప్రతాప్ లాగా అగ్నివీర్ మిమ్మల్ని చితక్కొట్టారు. మరి పందెమేనా? అల్ప ప్రమాణమైన డి.ఎన్.ఝా పరిశోధన నుంచి పాయింట్లు తీసుకురామాక.

## 21
## హిందు గ్రంధాల ప్రకారం గోమాంసం తినవచ్చు.

నేను బీఫ్ తింటాను. హిందూ గ్రంధాలైన వేదాలు, గీత, రామాయణం, మహాభారతం, మనుస్మృతి లలో కూడా వీటికి అనుమతి ఉంది.

అగ్ని వీర్:

- గోమాంస ప్రియుడు ఇప్పుడు హిందూ ప్రేమికుడయ్యాడు తర్వాత ప్రాచీన భారత్ ప్రేమికుడు అయ్యాడు చూడండి.
- వేదాలు కూడా ఎవరైతే అమాయక మనుషులను ఆవు లాంటి జంతువులను చంపుతారు వారిని కఠినంగా శిక్షించమని రాజ్యసభలకు చెప్పడం జరిగింది. ఒక ఒప్పందం చేసుకుందామా? వేదాల ప్రకారం నువ్వు బీఫ్ తిను, నేను కూడా వేదాల ప్రకారం నడుచుకుంటాను. ఏమంటారు బీఫ్ ప్రేమికులారా!!
- మీరు ఇదే విధంగా ఖురాన్ పంది మాంసాన్ని సమర్థి-స్తుందని

గాని ప్రవక్తలపై కార్టూన్లు వేయడం గానీ చేయగలరా? హిందూ నుంచి ఇస్లాం మతంపై విషయం మళ్ళ గానే, ఇది మా మతానికి సంబంధించిన ఆంతరంగిక విషయమని చెప్తున్నారు. ఇప్పుడు వెంటనే అరబిక్ వచ్చిన వాడిలాగా ఖురాన్లో పందిమాంసం నిషేధించారని ప్రవక్తలపై కార్టూన్లు నిషేధించారని అలాగే సంస్కృతం వచ్చినోడిలాగా వేదాలలో గోమాంసం రక్షణ ఉండేదని చెప్పమాక. ఈ బుర్ర పరిమాణము, స్థితి తెలిసినవాడిగా నీకు సంస్కృత భాష అర్థం కాక ఝా లాంటి మూర్ఖులు రాసిన పుస్తకాల నుంచి కాపీ కొట్టిన ద్వేష భావజాలంతో ఎవరికీ హాని కలిగించని నమ్మకాలతో శాంతికాముకంగా బతికే హిందువులపైన నీ అకృత్యాలను చేస్తున్నావు.

- ఖురాన్లో పంది మాంసం, ప్రవక్తలపై కార్టూన్లు నిషేధించారు అన్న వాదనలో నీకు గట్టి నమ్మకం ఉంటే వేదాలలో గోమాంసం నిషేదించబడింది, భారతదేశంలో బూతు చిత్రాలు నిషేదించబడింది అన్నప్పుడు నీవు అన్న బా*చో మాటలు అనగలవా?
- ఖురాన్లో పంది మాంసం కార్టూన్లు, గీయడంపై అనుమతి ఉంటే మరి గట్టిగా ఎందుకు చెప్పవు?
- ఖురాన్లో పంది మాంసము కార్టూన్లు పై అనుమతి ఉందో లేదో అన్న సందిగ్ధం ఉన్నప్పుడు అంత కచ్చితంగా వేదాలలో గోమాంసం ఉండేదని ఎలా చెప్పగలుగుతున్నారు.? అరబిక్లో ప్రవేశం ఉందోలేదో చెప్పలేవు గాని సంస్కృతంలో పండితుడు లాగా మాట్లాడుతున్నావే. వీడియో గేమ్ ఆడినంత తేలికగా శాంతికాముక హిందువులపై దాడి చేయొచ్చనా? సహనశీలురైన వారిపై దాడి మిమల్ని శాశ్వతంగా శాంతింప చేయగలదు.

చెప్పొచ్చే నీతి ఏంటంటే గోమాంసం తినడం హిందువులకు ఎంతంటే ముస్లింలకు ప్రవక్తపై కార్టూను గీసినంత. ఇంకా ఎక్కువే ఎందుకంటే కార్టూన్లో ఎవరిని చంపడం జరగదు కానీ గోమాంస భక్షణలో తల్లిలాంటి ప్రాణి చంప బడుతుంది. ఇంకా అగ్నివీర్ ఇచ్చే సలహా ఏంటంటే ఎదుటివారి హానికలిగించని సెంటిమెంట్లను గౌరవించాలి.

- ఇస్లాం టెర్రరిజం విషయంలో 'టెర్రరిజం కు మతం లేదు' అన్న వాక్యాలను కక్కుతూ ఉంటావు. కానీ ఖురాన్లో హదిత్ లలో వందలకొలది వాక్యాలు హింసను ప్రేరేపిస్తున్న టు ఉన్నాయి కదా. కోట్ల మంది హిందువులు గోమాతను చంప వద్దని మిమ్మల్ని బ్రతిమి లాడుతుంటే ఉంటే మీరేమో వేద సాహిత్యం అంటూ గోమాంస భక్షణకు సమర్ధించే వాక్యాలు ఉన్నాయంటూ ఎందుకు వాదనలు మొదలుపెడుతున్నారు?

హిందువుల విషయంలో మెజారిటీ ప్రజల భావాలను తుంగలోకి నెడుతూ మా పవిత్ర గ్రంథాలలో అక్షరం ముక్క ఏముందో కూడా తెలియకుండానే నీవి భగవంతుడి వాక్యాలు లాగా నీ కోరికల భావజాలాన్ని మాపై పూలమాలని ఎందుకు చూస్తావ్. ఇస్లాం విషయం వచ్చేసరికి, మెజారిటీ దేశ ప్రజల ఆమోదం కాని, ప్రచురించబడిన ఇస్లాం వాక్యాలు గాని మీ వాదనను సమర్ధించడం లేక పోయినా టెర్రరిజానికి మతం లేదు అంటూ బిగ్గరగా అరుస్తావు.

## 22
## స్వామి వివేకానంద గోమాంస భక్షణను సమర్థించారు.

హిందూ సంస్కృతిలో బీఫ్ అన్నది చాలా ముఖ్యమైన పాత్ర అని స్వామి వివేకానంద అన్నారు.

అగ్నివీర్:

- ఔరా! ఉన్నపళంగా మీరు వివేకానందుల కు పెద్ద అభిమాని అయిపోయారే. హిందువులు, జైనులు మరియు సిక్కు మతస్తులు అందరూ గోమాతను ప్రేమిస్తారని వివేకానందుల వారు చెప్పారని నీకు తెలియదా?

- ఎక్కడ ఎక్కడో వాఖ్యానాలు, ఎవరెవరి పైనో పెట్టినా పెట్టకపోయనా గోమాంస భక్షణ ఈ రోజున హిందువుల మనోభావాలను తీవ్రంగా భాదిస్తుంది. ఆవును చంపడం అమానుషం, ప్రకృతినకి హానికరం, ఈ అనారోగ్యపు అలవాట్లకు ఎన్నో ప్రత్యామ్నాయ ఉండగా

హిందువుల మనోభావాలు దెబ్బ తీయడం ఎందుకు? కనుక బీఫ్ తినడం బుద్ధిలేని పని.

- వివేకానందుల వారిని పూర్తిగా చదవండి. అందులోని సత్యాన్ని మాత్రమే సంగ్రహించండి, హాని హిందువుల సెంటిమెంట్లను బాధించే వాటిని వదిలేయండి. అదే ధర్మం.

ప్రాచీన చరిత్ర గురించి మాట్లాడొద్దు. హిందువులంతా విగ్రహారాధన చేస్తారు కనుక నరకానికి వెళతారు అనే కాలం గురించి మాట్లాడొద్దు. దేశ జెండా అంటే కాషాయ రంగులో ఉండే రోజుల గురించి మాట్లాడొద్దు. ఇస్లాము టెర్రరిస్టుపై మానవత్వం చూపిన పృధ్వీరాజ్ చౌహాన్ కాలం గురించి మాట్లాడొద్దు. జయ్ చంద్ పంచన చేరిన కాలం గురించి మాట్లాడొద్దు. అటువంటి చర్చల వల్ల మీకు ఎటువంటి ఉపయోగం ఉండదు.

- వివేకానందుల వారి బోధనలను వక్రీకరించవద్దు. అసలు విషయాన్ని పక్కదోవ పట్టించే బదులు, నేను చెప్పేది విను. ఒకవేళ నువ్వు వక్రీకరించి దేవుడే బీఫ్ తినమన్నాడు అది మంచిదని చెప్పినా ఏమి అవ్వదు, ఎందుకంటే హిందూయిజం అంటే ఎవ్వరూ ప్రశ్నించకూడని ఆకాశం పైనుంచి ఊడిపడ్డ ఒక పుస్తకంపై గుడ్డి నమ్మకం పెట్టుకొని లేదు. హిందూయిజం ఎప్పుడూ శాస్త్రబద్ధంగా హిందువుల మనోభావాలకు అనుగుణంగా ఉండేటటు వంటిది.

వర్తమానంలో బ్రతుకుదాం. ప్రజల సెంటిమెంట్లను గౌరవిద్దాం. హిందూయిజం ఆరోగ్యకరమైన జీవన విధానం అని, ప్రకృతి మమేకమయ్యి, ప్రపంచ ఆర్థిక ప్రగతిని పెంచేటటువంటిదని అంగీకరిద్దాం. ఆధునిక జై చంద్ లాగా ఉండాలనుకోకు.

- ప్రాచీన హిందూయిజంలో బీఫ్ గురించి వాస్తవాలు తెలుసు కోవాలి అంటే వీడియోలు చూడు వాటిలో ప్రపంచంలోనే మనిషికి అందిన అతిపురాతనమైన, తొలి పుస్తకమైన హిందువుల కు చెందిన వేదాలు. కుదిరితే జాగ్రత్తగా చదువు. అందులో ఆవులను ఎవరైతే చంపుతారు వారిని శిక్షించమని చెప్పబడింది. ప్రాచీన భారతంపై మీకున్న ప్రేమను చూసి కవిత్వంగా చెప్పాలంటే ఉన్న ఫలంగా బాల్కనీ పైనుంచి దూకి చావు.

# 23
# బీఫును ప్రపంచమంతా తింటున్నారు.

ప్రపంచంలో ప్రతీ మూలా బీఫ్ తింటున్నారు అక్కడ కూడా బీఫును బ్యాన్ చేయమని అడగగలవా?

అగ్నివీర్:

- దోమలు అన్నిచోట్ల ఉంటాయి. అలాగని వాటిని తెచ్చి ఇంట్లో పెట్టుకుని డెంగ్యూ జ్వరం తెచ్చుకుంటామా? లేకపోతే నీకు ఏది మంచిదో తెలుసుకుని బుర్ర లేదనుకుందామా? అందుకని మిగతా ప్రపంచపు బోధనల కోసం ఎదురుచూస్తావా? అలాగైతే బుర్రలేని బుర్రలు ఏదన్నా పిల్లకాయలు ఆటలు ఆడుకుంటూ ఉండాలి కన్నతల్లిని అవమానించకూడదు. కాదంటే మరి మిగతా ప్రపంచం అంటూ ప్రస్తావనలు తేవద్దు. నా దేశానికి, నా ఇంటికి ఏది సరైనదో నా విజ్ఞతతో నేనే నిర్ణయించుకొంటాను..

- ప్రతి నాగరికత చెందిన దేశము అక్కడి ప్రజల మనోభావాలకు విరుద్ధంగా కొన్ని జాతులను చంపితే తీవ్రంగా శిక్షిస్తాయి. ఇంకా బాగా తెలుసుకోవాలంటే అమెరికాలో బాల్డ్ ఈగిల్ (గ్రద్ద)ని చంపి చూడు.

అధ్యాయం 6

# మాంసం తినడం- అపోహలు, వాటి వాస్తవాలు

మాంసాహారం తినే జంతువులకు, మనుషులకు కొంతైనా తేడా ఉండాలి కదా కాళ్ళు ఎన్ని అనో, తోక వెనుకనో కాకుండా.

-అగ్ని వీర్

ఈ చివరి అధ్యాయంలో మాంసం తినేవారు సాధారణంగా అడిగే ప్రశ్నలకు హేతుబద్ధంగా సమాధానం చెప్పడానికి ప్రయత్నిస్తాను. ఎందుకంటే మాంసాహారులు వారు తినే అలవాట్లను సమర్ధించుకోవడానికి సహజంగానే ప్రయత్నిస్తారు. ఎందుకంటే వాళ్ల సందేహాలకు అలవాట్లకు సరిపడా సమర్ధించే పాయింట్లు దొరక్క వారూ ఇబ్బంది పడుతూ ఉంటారు. సమాధానాలకు దిగేముందు అసలు నేనెందుకు మాంసం తినను కారణాలు చెబుతాం నేను మాంసం తినను కోడిగుడ్డు తినను అందరూ మాసం తినడం ఆపేయాలని కోరుకుంటాను ఆ కారణాలు ఇవిగో.

## అత్యంత కాలుష్య కారకమైన పరిశ్రమ

వ్యవసాయ జంతువుల మాంసం ప్రపంచంలోనే అత్యంత కాలుష్యకారక పరిశ్రమలు. ఈ రోజున మనం ఏదైతే పర్యావరణ నష్టం కలిగింది అనుకుంటున్నాము అవి ఇలాంటి ఆ పరిశ్రమల వల్లే జరిగింది. (కావాలంటే పర్యావరణంలో మార్పులు, వాతావరణ కాలుష్యం జలం అంతరించిపోవడం జీవవైవిధ్యం లోపించడం లాంటి విషయాలపై ఐక్యరాజ్యసమితి ప్రచురించిన పత్రాలు చూడండి.)

## పేదరికం మరియు ఆకలి ఈ పరిస్థితికి కారణాలు

ప్రపంచంలో ఉన్న పేదరికం, ఆకలికి ఈ మాంసాహార కు అలవాట్లే మూలకారణం. నేను ఆకలితో, పోషకాహారలోపంతో ఉండటం నాకు ఇష్టం లేదు. అలాగే కోట్లమంది అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు ఇదే భూమి నుంచి పుట్టిన వారి పట్ల కూడా నేను అదేవిధంగా భావిస్తాను. వాళ్ళ ఆకలి తీర్చడానికి నన్ను నేను అర్పించుకోవడానికి ఏ మాత్రం వెనుకాడను.

నాకు తెలిసిందేంటంటే ప్రజలు మాంసం తినటం ఆపేసి శాఖాహారం అలవాటు చేసుకుంటే పదిరెట్లు ఎక్కువ మంది ప్రజలను ఆహారపు అవసరాలను అవే శ్రమ సంపదలతో తీర్చవచ్చు. ఆహారపు పిరమిడ్ చిత్రం లాగా, శక్తి పిరమిడ్ లను అనుసరించి ఒక వంతు మాంసం కోసం సుమారు మరో పది వంతులు వృక్ష సంబందితాలు ఖర్చు అవుతాయి. మీరు ఏ పుస్తకాన్నయినా తిరగేయండి ఆహార పక్రియ పరిణామక్రమం గాని శక్తిని సూచించే పిరమిడ్ చిత్రాన్ని గాని చూడండి. ఇంకా మనం షాపుల్లో కొనే మాంసపు ఉత్పత్తులు ఇంకా ఎక్కువ శక్తిని వనరులను ఉపయోగించుకుంటాయి.

కనుక ఎవరైతే మాంసం తినడాన్ని ఆపేస్తారో వారు ఏమీ చేయకుండానే మరో తొమ్మిది మందిని పోషించినట్లు అవుతుంది. ఇంతకంటే చేయాల్సిన సేవ ఏమి ఉంటుంది.

అలాగే మటన్ బిర్యానీ తినాలన్న నా జిహ్వా రుచికోసం 9మంది ఆకలిచావులను కారణమైన దాన్ని మించిన పాపం మరేముంటుంది. మాంసపు ఉత్పత్తుల పరిశ్రమ ఉన్న నీటి వనరులను తగ్గించి వేస్తుంది.

ప్రపంచంలో ఉన్న మనుషులందరూ నా కుటుంబ సభ్యులుగా భావిస్తాను కనుక నా ప్రియమైన సోదర సోదరిమణులలో, అమాయక చిన్నపిల్లలో ఏ ఒక్కరు ఆకలితోనో, దాహంతోనో ఉంటారన్న భావన వస్తే నేను ఆరోజు నిద్రపోలేను.

## మాంసానికి ప్రత్యామ్నాయాలు ఉన్నాయి

ఈరోజుల్లో ఆఫ్రికా అడవుల్లో సింహాల లాగా బతకటం కోసం వేటాడే అవసరమైతే లేదు. శాకాహారంలో దొరికే ఆరోగ్యకరమైన ఆహారానికి పోటీపడగల మాంసపు ఉత్పత్తి ఏమీయు లేదు.

## మాంసము పునరుత్పత్తి చేయలేదు

మాంసాన్ని పునరుత్పత్తి చేయలేము ఎందుకంటే ఒకసారి జంతువును చంపిన తరువాత మరో జంతువు అందులోంచి పుట్టలేదు. కానీ అదే శాకాహారంలో ఐతే వాటి విత్తనాలు వల్లో, వేర్ల వల్లో, మొలకల వల్లో మరొక మొక్కను, చెట్టును పునరుత్పత్తి చేయవచ్చు.

## జీవితం చాల అందమైనది

నా జీవితం నాకెంత ప్రియమైనదో అలాగే ప్రియమైన నా దగ్గరి వాళ్ళ వాళ్ళ జీవితాలు కూడా అంతే విలువైనదని భావిస్తాను. నావల్ల ఏ ప్రాణికైనా హాని జరిగితే నేను తలకిందులైపోతాను ఎందుకంటే ప్రాణకోటిలో అత్యంత విలువైన మనిషిజన్మ.

మరి మనలాగే జంతువులు కూడా వాటి వాటి జీవితాన్ని ప్రేమిస్తాయి కదా. వాటికి మనలాగే మొహం, తలకాయ, ప్రాణం, భావాలు ఉంటాయి కదా. మనం ఎలా భయపడతామో అలానే అవి కూడా వాటి ప్రాణాల గురించి భయపడతాయి కదా. మరి మరో ప్రాణిని మనం ఎలా హింసించగలం?

నాకు మూగజీవాల భాష అర్థం కాలేదనో, అవి మనకన్నా తక్కువ తెలివిగలవారు ప్రాణులనో, వాటిని చంపే అర్హత, ఆధిపత్యం వస్తుందా? మరి ఇదే వాదనతో మానసిక రోగులు కూడా అలాంటి వారే కదా. మరి వారిని చంపటాన్ని కూడా చట్టబద్దం చేద్దామా? కోమాలో ఉన్న రోగులను కూడా చంపడాన్ని చట్టబధ్ధం చేద్దామా? అనాధ పిల్లల్ని చంపడం కూడా

చట్టబద్ధం చేద్దామా? మరి అవి చట్టబద్ధం అప్పుడు మాంసం తినడం కూడా అటువంటి నేర తీవ్రత కలిగినది కాదా?

## 1
## చెట్లకి కూడా ప్రాణం ఉంది.

కాబట్టి మొక్కలని, చెట్లని తినటం ఆపాలి కదా. సైన్స్ కూడా వాటికి ప్రాణం ఉందని నిరూపించింది.

సైన్సు కేవలం మొక్కలలో కణాల రీతులు, ప్రక్రియలు జంతువులలో లాగానే ఉంటాయని చెప్పింది. కానీ మొక్కలకు కూడా జంతువులవలె వ్యక్తిత్వాలు ఉంటాయని నిరూపించబడలేదు. మొక్కలకు చెట్లకు జంతువులవలె బాధ, ఆనందం ఉంటాయని సైన్సు ఋజువు చేయలేదు. జంతువులను చంపి తింటే అక్కడితో ఆ జంతువు పునరుత్పత్తి చేయడం ఆగిపోతుంది. కానీ మొక్కల విషయంలో అలా కాదు వాటి యొక్క విత్తనాలు, దుంపలతో మరల వేల, లక్షల మొక్కలను సృష్టించవచ్చు. మొక్కలకు జంతువులకు చాలా చాలా తేడాలు ఉన్నాయి అందుకే వాటిని జంతుశాస్త్రం, వృక్షశాస్త్రం అని విడివిడిగా సంభోదించి వర్గీకరించారు.

మనుషులం జంతువులను తినకుండా బ్రతకగలం. కానీ మొక్కలను తినకుండా బతకలేం కదా. మనిషి జన్మలో ప్రకృతికి, ప్రాణికోటికి హాని జరగకుండా మనుగడ సాగించలేము అన్న సంగతిని అంగీకరిస్తూనే మనం ప్రకృతికి, ప్రాణికోటికి ఎంత తక్కువ హాని కలిగిస్తాము మన జీవన విధానం వల్ల అన్నది ప్రధానం అవుతుంది.

బీఫ్ ముక్క వదిలేసి శాఖాహారం తినటం వల్ల మరో పదిమందికి తినడానికి తిండి తాగడానికి నీళ్లు దొరుకుతాయి. పేపర్లో చదివేవాళ్ళం ఈ రోజు ఇంత ఆకలితో చనిపోయారు అని. మనం జాలి చూపి వల్ల అతి సామాన్యమైన బుద్ధిని చూపడం వల్ల కొంత మంది ప్రాణాలను కాపాడవచ్చు. లేదంటే భవిష్యత్తులో ఇవే వాదనలు నరభక్షకులు విషయంలోనూ వినాల్సి వస్తుంది.

# 2
# జంతువులు మాంసాన్ని తింటాయి కదా మరి మనిషి ఎందుకు తినకూడదు.

## సింహాలు, పులులు మాంసాన్ని తింటాయి. మరి మనుషులు తింటే తప్పేంటి?

సింహాలు, పులులు మరియు ఇతర మాంసాహార క్రూర జంతువులు మాంసాన్ని తింటాయి. ఎందుకంటే అది ప్రకృతి సహజం. అవి కనుక అలా తినకపోతే చనిపోతాయి. అవి మనలాగా ఆలోచించి, విశ్లేషణ చేసి ఏది తినాలో, ఏది తినకూడదో నిర్ణయించుకునే శక్తి సామర్ధ్యాలు వాటికి లేవు. ప్లేట్లో పెట్టుకుని తినాలో, గిన్నెలో పెట్టుకుని తినాలో, వండి తినాలో, ఉండకుండా తినాలో, మరో మాంసంతో కలిపి తినాలో, లేక వాటిపైఇంకేమైనా నంచుకుని తినాలో, పచ్చిగా తినాలో, తందూరి చేసుకుని తినాలో, వేపుడు చేసుకుని తినాలో వాటికి తెలియదు. మనుషులు మాత్రమే తయారు చేయడమే కాకుండా, దాన్ని అలంకరించి మరీ తింటారు. ఏది మంచిదో, ఏది చెడ్డదో, ఏది పనికిరాదో, ఏది పనికి వస్తుందో తెలుసుకొని తినడం కేవలం మనుషులు మాత్రమే చేస్తారు.

కనుక మనుషులు జంతువులను తినాలో, మొక్కల్ని తినాలో ఎంచుకునే సమయమిది. మాంసాహారం తినడం వల్ల ఆకలి చావులు పెరుగుతాయి, పర్యావరణం కాలుష్యం అవుతుంది అనడానికి 100% సాక్షాలు ఉన్నాయి. స్పృహ ఉన్న వ్యక్తిగా నేనయితే జంతువులను తినను. మొక్కల విషయంలో ఇంకా వివాదం ఉంది. కొంతమంది వాటిలో కేవలం రసాయనిక పరిణామాలే కానీ వాటికి ఆత్మ లేదని, వ్యక్తిత్వాలు లేవని అంటారు. కొంతమంది వాటికి ఆత్మ ఉందని, కాని వ్యక్తిత్వం లేదని నమ్ముతారు. మొక్కల విషయంలో సందిగ్ధాలు అయితే ఉన్నాయేమో కానీ, మాంసాహార విషయంలో లేదు. పైగా జిహ్వా రుచి కోసం జంతువులను చంపడం నేరానికి ఏమాత్రం తీసిపోదని తేలుస్తున్నాయి.

రెండు సీసాలు ఉన్నాయనుకోండి. అందులో ఒక దాంట్లో ఖచ్చితంగా విషం నిండిన నీళ్లు ఉన్నాయి. ఆ సీసాని తెరచి తాగితే ఖచ్చితంగా

పదిమంది చనిపోతారు. అదే మరొక సీసాల్లోనే నీళ్లు తాగితే ఎవరు చనిపోరు అనుకుందాం. ఒకవేళ మీరు బలవంతంగా రెండు సీసాలలో ఒక సీసాని తాగాల్సిన పరిస్థితి వస్తే మీరే సీసాని ఎంచుకుంటారు? శాఖాహార విషయం కూడా అలాంటిదే మనుషులు సహజసిద్ధంగా తినే ఆహారం, శాకాహారం.

## 3
## నేను దేవుని నమ్మను. కనుక నేను ఏదైనా తింటాను.

నేను నాస్తికుడిని. దేవుడు ఆత్మ ఇలాంటివి నేను నమ్మను. జంతువులు చెట్లు ఇవన్నీ నాకు జీవరసాయన క్రియలు లాగా కనిపిస్తాయి కాబట్టి నేనెందుకు శాకాహారం మాంసాహారం అని వేరు వేరుగా చూడాలి?

నీవు నాస్తికుడు అయినా, దేవుడున్నాడో లేడో తెలియదు వాడిపైతే నువ్వు శాఖాహారం తినడానికి అందరికన్నా నీకే ఎక్కువ కారణాలున్నాయి. నీవు మానవవాదాన్ని నమ్ముతాము అని అనుకుంటున్నాను. ఒక మనిషిగా ఇంకొక మనిషిని బాధించటం నాగరిక సమాజంలో హర్షించరని నీకు తెలుసు. నీవు సాటి మానవులను ప్రేమిస్తావు అనుకుంటున్నాను. మానవత్వం మీ రక్తంలో ఉంది అనుకుంటున్నాను. ప్రతి అమాయక మనిషి మేలు కోరుతావు అనుకుంటున్నాను. కాబట్టి చికెన్ టిక్కా కోసమో, మటన్ బిర్యానీ కోసం నీవు తొమ్మిదిమంది సాటి మానవుల ఆకలిదప్పికలు పట్టించుకోవు అనుకోను. పర్యావరణాన్ని పాడు చేసే మాంస భక్షణ అలవాటు భవిష్యత్తు తరాలను, అనారోగ్యాలతో, కాలుష్యాలతో, పేదరికంతో మగ్గాల అని నీవు కోరుకుంటావు అని అనుకోవడం లేదు. నీవు నీ పిల్లలను ప్రేమిస్తావు, వాళ్ళకి దీవెనలు ఇస్తావు కానీ తిట్లు శాపనార్థాలు పెట్టవు కదా. ఇదే నిజమైతే మాంసాహారం వద్దు- జీవహింస వద్దు అని ప్రచారంలో మీలాంటి నాస్తికులే అందరికన్నా ముందు వరుసలో ఉండాలి.

ఒకవేళ అది అబద్ధమైతే నాస్తికుడిని చంపి తినడం కూడా న్యాయమే.

## 4
## పాలు తాగడం కూడా తప్పు.

మరప్పుడు జంతువులను పెంచడం వాటి పాలు తాగడం కూడా తప్పులు కదా?

ఈ విషయాలు సందిగ్ధతతో కూడినవి. వీటిపై విడిగా వాదన చేయవచ్చు. ఒకవేళ అది నేరం అయితే జంతువులను చంపటం అన్నది నేరాలకే అందని నేరం. మనం ఇటువంటి చిన్నపాటి విషయాలలో విభేదించిన, ఘోర నేరాలు చేసి పర్యావరణాన్ని మానవాళికి చెంత వాడికి హానికలిగించకూడదు కదా.

పాలిచ్చే జంతువులను పెంచడం వాటి పాలు తాగడం తప్పు అనేవాళ్ళు, జంతువులను ప్రేమించండి, శాఖాహారాన్ని పెంపొందించండి అని ప్రచారం చేసే ఉద్యమంలో కాగడా పట్టుకుని అందరికంటే ముందు నిలబడాలి. ఏమంటారు?

## 5
## నేను ఉండే ప్రదేశంలో కేవలం మాంసాహారమే దొరుకుతుంది.

ఒకవేళ నేను ఏ అంటార్కిటిక్ లోనో, పాడుబడిన ద్వీపంలో వంటరిగా నో ఉండి నాకు మాంసం తప్ప మరే ఆహారం దొరకనప్పుడు నేనేం తినాలి.

ఇది చాలా ఆశ్చర్యకరమైన ప్రశ్న. నిజం చెప్పు నీ జీవితంలో నువ్వు ఎన్నిసార్లు అంటార్కిటికా వెళ్ళేవాడివి? నువ్వు ఎప్పుడు నరసంచారం లేని ద్వీపంలో రాబిన్సన్ క్రూసో లాగా బతికావు? ఈ ప్రశ్న వేశావు అంటే బతకలేని పరిస్థితుల్లో మాత్రమే జీవహింస చేసి మాంసాహారం తినొచ్చు కానీ అవకాశం ఉన్నప్పుడు శాకాహారంతో బతకవచ్చని ఒప్పుకున్నట్టేగా.

సరే ఒకవేళ అలాంటి విపత్కర పరిస్థితి వస్తే ఆ అవకాశం ఇద్దాం లే. కానీ 99.9% మానవాళి నివాసయోగ్యమైన ప్రదేశాలు, పరిస్థితులు ఎప్పుడు

శాకాహారంతో సమాజంలో బతికే అవకాశాలు ఉన్నాయి. ఆమాటకొస్తే నువ్వు తినాలనుకున్నా జంతువు కూడా ఏదో చెట్టూ-చేమా వీటినే కదా తినాలి. జీవవైవిధ్యంలో చెట్లు మాత్రమే సౌరశక్తిని నుంచి జీవశక్తిని ఆహారాన్ని పొందుతాయి. నీవు తినాలనుకున్న జంతువులు అలా చేయలేదు.

## 6
## గుడ్లు ఆరోగ్యానికి మంచిది.

గుడ్ల సంగతేంటి గుడ్డు ఆరోగ్యానికి మంచిది కదా ప్రభుత్వం కూడా గుడ్డు తినమని ప్రోత్సహిస్తోంది కదా.

ప్రభుత్వం చెప్పింది కదా అని అవి చెప్పేవన్నీ దైవ వాక్కులో, హేతువాదమో అవ్వదు. ప్రభుత్వం కూడా చాలా స్కాముల్లో ఇరుక్కుంది. అలాకాకపోతే అవినీతిపై ఉద్యమాలు, ప్రభుత్వాలు మారే అవసరాలు ఉండవు కదా.

గుడ్ల విషయంలో మీరు ఎప్పుడైనా కోళ్ల ఫారంకి వెళ్లి చూశారా? కోళ్లను జాలి లేకుండా ఎలా పెంచుతారో అలానే మీ వారసులని పెంచగలరా? వాటిని చూసి మనుషులు కూడా వారివారి విసర్జాలను అందమైన ప్లేట్లో వేసుకుని తినగాలరా? అలాగైతే గుడ్లను తినాలని వాదించే ఒక కుంటి సాకు నీకు దొరికినట్లు. ఆధునిక అధిక పెట్టుబడి పెట్టిన కోళ్లఫారాలు కూడా కరాచీలో బస్ స్టాపులో ఉండే మురికి మూత్రశాల లాగానే ఉంటాయి.

అయినా గుడ్లలో దొరకని పోషక ఆహారాలు దొరకని శాకాహారం లేదు. పక్షి పిండాన్ని, దాని తల్లి గర్భాన్ని నాశనం చేసి, మనుషుల అనారోగ్యానికి కారణమయ్యి, పర్యావరణానికి కూడా హాని చేసే కంటే దినుసులు తినడం వివేకం.

## 7
## ప్రాకృతిక సంతులనం కాపాడాలంటే మనం మాంసాన్ని

## తినాల్సిందే.

మనం కనుక మాంసాన్ని తినకపోతే జంతువుల సంఖ్య పెరిగి పోయి మొత్తం భూమండలాన్ని ఆక్రమించేస్తుంది కనుక మనం జంతువులను చంపి తినాలి.

బహుశా నేను జీవితం మొత్తం మీద ఎదుర్కొన్న ప్రశ్నలలో ఇదే ముద్దొచ్చే, అతిక్రూరమైన ప్రశ్న. ముద్దొచ్చే ప్రశ్న అని ఎందుకన్నానంటే ప్రాథమిక పాఠశాలలో చేరిన పిల్లవాడు మొట్టమొదటిసారి ప్రకృతి గురించి తెలుసుకున్నప్పుడు ఏర్పడే ప్రశ్నే ఇది. క్రూరమైన ప్రశ్న ఎందుకంటే రాబిన్ హుడ్ లాగా ఈ మొత్తం భూమండలం యొక్క సమస్యను వేసుకొని ఎదుర్కొంటున్నట్టు ఉంది.

ఇందులో నిజమెంతో చూద్దాం. మనలో నిజంగా ఎంతమంది పక్రృతి గురించి ఆలోచించి జంతువులను తింటున్నాము? మనలో ఎంతమంది పర్యావరణవేత్తలుగా ఉన్నారు. మన జిహ్వా రుచికోసం ఏదోవిధంగా వాదించడమే గాని. ఒకవేళ మనుషులు కూడా సింహాలు పులులు లాగా వేటాడి తమ ఆహారాన్ని సంపాదించుకుని ఉంటే ఈ వాదినే ననిజమనుకోవచ్చు. సింహాలు, పులులు నిరంతరం మాంసం సరఫరా కోసం జింకల తోనో, గొర్రెలతోనో ఫామ్ హౌస్లు, డైరీ ఫారాలు కట్టుకోలేదు.

కానీ మనుషులు మాత్రం పెద్దపెద్ద వ్యాపార పూరిత మాంసపు ఉత్పత్తుల పరిశ్రమను నిర్వహిస్తున్నారు ప్రతిరోజు మనిషి యొక్క నాలుక రుచి కోసం లక్షల జంతువులను చంపుతున్నారు. 99 శాతం మంది మనుషులు జంతువులను పెంచేది చంపి తినటానికే. ఈ ప్రక్రియలో పకృతికి ఘోరమైన విపత్తు సృష్టిస్తున్నారు.

ఈ ప్రశ్న వేసినా మనిషి ఒసామా బిన్ లాడెన్తో సమానం ఎందుకంటే అతను కూడా టెర్రరిస్టుల దాడి మానవాళిని కాపాడటం కోసం అంటాడు. (నిజంగానే చాలామంది టెర్రరిస్టులు వారు చేసే మారణకాండ మానవాళికి దేవుడుకి చేసే సేవ అని అనుకుంటారు)

చెప్పడం మర్చిపోయాను, ఈ మనుషులు పులులు, సింహాలు లాంటి

క్రూరమృగాలను చంపి తింటారు అనుకుంటున్నారా? కానే కాదు. పోని అన్ని జంతువులను , పక్షులను తింటారు అనుకుంటున్నారా? కానేకాదు. ఇలాంటి చాలా మంది మనుషులు కాకులను, రాబందులను, నక్కలను, తేళ్ళను తినరు. మరి ఈ భూమండలం అంతా కాకులు రాబందులు నక్కలు తలతో విడిపోలేదేమిటో?

మరి ఈ భూమండలం అంతా కాకులు, రాబందులు, నక్కలు, తేళ్ళతో నిండి పోలేదేమిటో? మరి మనుషులు జనాభా కూడా రోజురోజుకీ పెరుగుతోందిగా మరి జబ్బు చేసిన వాళ్లని, వయసుమీరిన వాళ్ళని కూడా ఇలానే చంపి తినడం లేదు ఏందుకని?

జీవ సంబంధాలపై కనీస అవగాహన ఉన్న ఏ ఒక్కడు ఇలాంటి అశాస్త్రీయమైన వాదనలు చేసి నవ్వుల పాలు కారు.

పైగా ఈ మాంసపు పరిశ్రమ ఎన్నో జాతులు అంతం అవడానికి కారణం అయ్యాయి. అంతమైపోతుంది జీవ జాతుల గురించి జీవ సంతులనం గురించి ఏమాత్రం ఆలోచించినా తక్షణమే శాఖాహారం వైపునకు మళ్ళీ పోవాలి.

## 8
## మాంసం తినటం మనిషియొక్క సహజీవనం.

ప్రకృతిలో ఒక జంతువు ఇంకో జంతు ఉండటం సహజం అన్ని బలమైన జంతువులు ఇతర జంతువులు చంపి తింటాయి. కాబట్టి మనిషి సహజంగా సిద్ధాంతంగా చంపి తింటే ఏంటి తప్పు?

ఇందాకడ చెప్పినట్లుగా ప్రకృతిలో ఏ జంతువు మరో జంతువుని పెంచి మరీ చంపి తినదు. వాటి ఆకలి ప్రకారం అవి ప్రవర్తిస్తాయి.

రెండో విషయం ఏంటంటే ఈ సృష్టిలో బలమైన జంతువులన్నీ శాఖాహారమైనవే. ఏనుగు, గుర్రం, బైసన్ లాంటి అడివి ఎద్దులు, ఖడ్గమృగం లాంటివి.

మూడు, ఆ జంతువులను నగ్నంగా తిరుగుతాయి, అవి కవిత్వాలు చదవటం, కాలకృత్యాలు చేసాక వాటి అంగాలను కడుక్కోవటం లాంటి మనిషి చేసే అనేక పనులు అవి చేయవు. అవి మాంసాన్ని వండుకుని తినవు. ఒకవేళ మాంసం తినటం మనిషి సహజ సిద్ధమైతే అప్పుడు మనిషి ఆ మాంసాన్ని స్పూన్లతో, మూర్ఖులతో ఏసి హోటళ్ళలో కూర్చుని తినరు.

మనుషులు పరిణితి చెందిన తెలివైన మనుషులు. ఏది మంచి ఏది చెడు విచక్షణతో నిర్ణయించుకోగలరు. మనుషులు కారుణ్యం చూపాలి, విశ్వాస పూర్వకంగా ఉండాలి, హేతుబద్ధంగా ఆలోచించాలి. అసలు మనిషి సహజంగా ఉండటం అంటే వారే జంతువులను దగ్గరుండి కాపాడాలి కానీ హింసించకూడదు.

వివాదాన్ని మరింత ముందుకు తీసుకెళ్తే నర మాంసం రక్షణ కూడా ఒప్పుకోవాల్సి ఉంటుంది. బలమైన మనుషులు సహజసిద్ధంగా జనాలను తినాలి అని అనుకుంటున్నారు కాబట్టి. అవినీతి ప్రభుత్వం నశించాలి అని చేసే ఉద్యమంకి మరిక అర్థం లేదు. శక్తివంతమైన మనిషి మరొక బలహీనుడిని దగా మోసం చేయడం సహజసిద్ధమేగా మరి.

కనుక మనిషిగా ఉందాం. ఇవన్నీ రాక్షస ఆలోచనలని ఒప్పుకుందాం. మానవత్వం అంటే వివేకం, విచక్షణ, ప్రేమ, కరుణ, బలహీనులను బలవంతుల ఆధిపత్యం నుంచి కాపాడడం. ఇలాంటి లక్షణాలే మనుషులను జంతువుల నుంచి విడదీసి గొప్పవిగా చూపుతాయి.

## 9
## జీవ పరిణామ దృష్ట్యా మనుషులు మాంసం తినేటట్లు గానే తయారు చేయబడ్డాడు.

జీవ పరంగా మనిషి జంతువులను తినటానికి
తయారుచేయబడ్డట్లయితే మరి మనిషి దంతాలు, పేగులు అలా లేవే?

ఆవులు, గేదెలు నెమరు వేసుకున్నట్టు మన దంతాలు, పేగులు అలా

లేవు కదా కనుక మనం మాంసం తినటానికే తయారుచేయబడ్డాము. ఇది కూడా మన నాలుక రుచి కోసం చెప్పే మరో కుంటి సాకు లాంటిదే. మనుషులు గడ్డి తినే పశువుల నుంచి, వేటాడి తినే క్రూరమృగాల నుంచి వేరు చేయబడ్డారు. మనం ఆవుల లాగా గడ్డిని తినలేము. అలాగే కూర మృగాల లాగా పచ్చి మాంసాన్ని తినలేము. పులులు, సింహాలు లాగా మనకు బలమైన కోర దంతాలు లేవు. మహా ఐతే మనిషి కోర దంతం మొక్కజొన్న కండె నో, చెరకు ముక్కనో కొరక గలవు. కావాలంటే దంత వైద్యుని సంప్రదించండి.

మాంసం తినటం మనకు సహజసిద్ధమైన జీవనవిధానం అయితే మనం సహజంగానే వాటిని వండకుండా తినే వాళ్ళం. మిగతా జంతువులు మాదిరి వేటాడి జంతువులను గోళ్ళతో, దంతాలతో కొరికి తినేవాళ్ళం. జంతువులను బంధించి, కట్టిపడేసి పనిముట్లు ఆయుధాలతో వాటిని చంపము. ఏ జంతువు అలా చేయదు.

కానీ పళ్ళు కూరగాయలు ఉండకుండానే తినగలను కొత్తగా ఆరోగ్య సంరక్షణ సంఘాలు వండని కూరగాయల తినమని చెబుతున్నాయి. అంశం విషయంలో తప్పనిసరిగా కాల్చి మనిషి తినగలిగే స్థాయికి తీసుకు రావాల్సి ఉంటుంది. ఈ మధ్య కొంతమంది పచ్చిమోసం తినే పద్ధతి మొదలెట్టారు. కానీ డాక్టర్లు ఇన్ఫెక్షన్లు రాకుండా ఉండాలి అంటే మాంసాన్ని వండాలి అని చెబుతున్నారు. అయినా పచ్చి మాంసం తిన్న మనుషులందరూ అత్యంత జుగుప్సాకరంగా ఉందని, పచ్చిగా తినలేక పోయాము అని చెప్పారు. ఒకవేళ జీవశాస్త్రం నీకు ప్రేరణ అయితే శాఖాహారిగా మారు. మన మేధస్సు, దేహం, వివేకం, భావోద్వేగం అన్ని కారుణ్యం చూపే మనిషిగానే ఉన్నాయి.

## 10
## మా కుటుంబాలలో అయితే మాంసాన్నే ఎక్కువ తింటాం.

నేనున్న సమాజంలో కుటుంబంలో మాంసమే ప్రధానమైన ఆహారం ఉన్నపళంగా ఇప్పుడు నేను మాంసాన్ని ఆపేసి మా కుటుంబాలలో నేనొక పిచ్చోడు లాగా కనపడాలా?

ముందు ఇది చాలా నిజాయితీతో కూడిన ప్రశ్న. నిజంగానే చాలామంది నిజాయితీ ప్రజలు సంఘం యొక్క ఒత్తిడికి లోబడి మాంసాన్ని తింటున్నారు. ఇందులో నుంచి బయటపడాలంటే ఈసమస్యను ఇంకో కోణంలో చూడాలి.

ఒకసారి నువ్వు నరమాంస భక్షణ కుటుంబంలో ఉన్నావని ఊహించుకో. అప్పుడు కూడా నువ్వు మీ అమ్మాయి చేతినో, మీ తల్లి యొక్క వేళ్ళనో, మీ సోదరుడి పేగులనో, భార్య కాలునో మసాలా కూరలతో నంచుకుని తినగలవా?

బుర్ర ఉన్న మనిషి సాటి ప్రాణులన్నీ తన కుటుంబ సభ్యులుగా భావిస్తాడు. కాదు జంతువులను నేను పట్టించుకోను కేవలం మనుషులని మాత్రమే కుటుంబ సభ్యులుగా భావిస్తాను అని అనుకున్నా మాంసం తినడం వల్ల మరో పదిమంది మనుషులకు తిండి, నీరు లేకుండా చనిపోతారు కదా.

కనుక మనం ఎప్పుడైతే ప్రకృతిని మన సొంత తల్లి లాంటిది అని అనుకుంటామో అప్పుడు ఈ సమస్య దానంతట అదే తీరిపోతుంది. అప్పుడు ప్రపంచంలో పేదరికంలో ఉన్న సోదర సోదరీమణుల ఆకలి బాధ అంటే ఏంటో మనకు తెలుసి జంతువులను చంపి సంబరాలు జరుపుకోము. మొహమాటపడకుండా సమాజంలోని ఉన్నత మార్పునకు కారణభూతుడు అవుదాము. ఎవరైనా ఏమైనా అనుకుంటారేమో అనిపించుకోకుండా గర్వంగా మంచి పని చేస్తున్నామని గ్రహించండి.

## 11
## అంటే మాంసం తినే వాళ్ళు అంతా హంతకులా.

అంటే నువ్వు అనేది మాంసం తినే వాళ్ళు అందరూ హంతకులు కనుక వారిని ద్వేషించాలి.

ఒకరకంగా చూస్తే ప్రశ్నలో మొదటి సగం నిజమే. ఎవరైనా, ఏ రకంగానైనా అమాయక ప్రాణాన్ని తీసేస్తారో వారు నిందితులే. కానీ వారిని ద్వేషించాలి అనడంలో మేము ఏకీభవించడంలేదు. మాంసం తినడం అన్నది ఇవాల్టి

రోజున సంస్కృతి సమస్య. సాంస్కృతిక సమస్యలనేవి సున్నితత్వం పెంచడం ద్వారా, చైతన్యవంతుల్ని చేయడం ద్వారా తొలగించవచ్చు. అంతేగాని తాలిబాన్ తరహాలో ద్వేషించడం, శిక్షించడం ద్వారా కాదు. మాంసం తినకూడదు అనటానికి పునాది సాటి జీవులపై నిజమైన కరుణ, స్పందన కలిగి ఉండటం అనేది కీలకం గ్రహించాలి.

చట్టంలో కొద్దిగా మార్పులు చేసి మాంసాహారాపు అలవాట్లకు ప్రతికూలంగా, ఆరోగ్యకరమైన మానవాళికి అనుకూలమైన శాఖాహారాన్ని పెంపొందించే విధంగా మార్పులు చేయాలని భావించే వారితో మేము ఏకీభవిస్తాము. మానవులంతా ఒకే కుటుంబం. ఒకరికొకరం ఉపకారం చేసుకుంటూ ప్రేమను పంచుదాం కాబట్టి ఒకవేళ నీవు మాంసాహారం తిన్నా, కొత్తగా పుట్టిన లేగదూడను దాని తల్లి ఎలా ప్రేమిస్తుందో నేను నిన్ను అలానే ప్రేమిస్తాను. అందుకే కదా మాంసం తినవద్దు అని ప్రాధేయ పడుతున్నాను.

## 12
## మాంస ఉత్పత్తుల పరిశ్రమని మూసివేయడం ద్వారా నిరుద్యోగం పెరుగుతుంది.

దీనివలన మాంసం ఉత్పత్తులపై ఆధారపడిన ఇతర పరిశ్రమలకు ఏమి జరుగుతుందో ఆలోచించారా. ఆయా పరిశ్రమల్లో పనిచేసే ఉద్యోగుల పరిస్థితి ఏమిటి?

ఏమీ అవదు వారింకా మరింత ఉత్పాదకత పెంచిన వారవుతారు. మాంసం బదులు వారిప్పుడు అదే శ్రమతో దినుసులు, బియ్యం, కూరగాయలు తదితర వ్యవసాయ ఉత్పత్తులు పండించి మరో పదిమందికి ఆకలి దప్పులు తీర్చగలరు. దీనివలన ఉపాధి కల్పించి ఆర్థికంగా మరింత అభివృద్ధి అందరికీ కల్పించిన వారవుతారు. భవిష్యత్తు తరాలవారు మనం ప్రకృతిని కాపాడి నందుకు, వారికి కరువుకాటకాలు ప్రసాదించనందుకు మనల్ని కృతజ్ఞతాభావంతో గుర్తుపెట్టుకుంటారు.

# 13
# మనుషులు తగిన కారణం చేతనే మాంసాహారిగా మారి ఉంటారు.

## మాంసం తినటం అసహజం అయితే ఈ మొత్తం భూప్రపంచం మీద మనుషులందరూ మాంసాన్ని ఎందుకు తింటున్నారు?

ఇదే ప్రశ్న మోసాలు జాతివివక్ష లింగవివక్ష హత్యలు వంటి నేరాల విషయంలోనూ ప్రశ్నించుకుంటే సమాధానం వస్తుంది. ఇటువంటి అసాంఘిక చర్యలన్నీ అజ్ఞానంతోటి, అవివేకం తోటి జరుగుతాయి. బైబిల్ గ్రంధంలో కూడా మానవులు మొదట శాఖాహారులనే రాసివుంది ( ఆదికాండం 1.29)

మానవాళికి తెలిసిన అతి పురాతన గ్రంధాలు అయినా వేదాలు అయితే మానవులంతా శాఖాహారాన్ని తినమని ఘోషించాయి. మానవాళికి అత్యంత పురాతనమైన గ్రంధాలైన వేదాలలో యజుర్వేదం లోని మొదటి మంత్రమే జంతు కోటిని పరిరక్షించాలని చెప్తుంది.

కొన్ని తరాలుగా వివేకం లోపించడం వల్ల కానీ, అభివృద్ధి లేకపోవడం వల్ల కానీ సింహపూరిత కాలంలో ప్రజలకు రోజు వారీ అవసరాలు ఎదుర్కోడానికే ఎక్కువ ప్రాముఖ్యతను ఇచ్చేవారు. లేక పాతకాలపు ఆచారాలు సంస్కృతి పేరిట మతం పేరిట గుడ్డిగా అనుసరించే వారు కనుక మాంసాహార అలవాట్లు సామాజిక సమస్యల ప్రాముఖ్యతను సంతరించుకొని సామాజిక సమస్యలుగా పరిణమించాయి.

మనం వర్తమానం గాని భవిష్యత్తు గాని నిర్ణయించుకుని టప్పుడు గతంలో మనమేం చేసాము అన్నది పట్టించుకోము కదా. మన ప్రస్తుత అవసరాలు భవిష్యత్తు అవసరాలు దృష్టిలో పెట్టుకొని హేతుబద్ధంగా ఆలోచిస్తాము. అందుకే మనం ల్యాప్టాప్లు, మొబైల్ ఫోన్లు, టీవీ చూడడం విమానాలలో ప్రయాణాలు చేస్తుంటాం. గతంలో జరిగిన ఘోరాలను గుర్తుచేసుకొని బాధపడి ప్రస్తుతం ఈ రోజుని పాడుచేసుకోవడం చాలా పెద్ద తప్పు. ఇటువంటి రోజు గతంలో ఎప్పుడూ రాలేదని నచ్చ చెప్పుకోండి. ఈరోజు కాపాడాలంటే ఏమి చేయాలో ఆలోచించండి కొంతమంది చపల చిత్తం కోసం వారి నాలికలా ఉత్సాహం కోసం ప్రపంచంలో కొన్ని

లక్షలమంది బలవుతున్నారు.

## 14
## మానవ హక్కులే ఎందుకు? మరి జంతువుల హక్కుల వద్దా?

నేనింకా నువ్వు మానవ హక్కుల పరిరక్షణ వ్యక్తిగా
వస్తావనుకున్నాను. అప్పుడు నేను శాఖాహారుల ఆహారమైన
మొక్కలు, చెట్లు పరిరక్షణ కోసం వద్దామనుకున్నా. కానీ నువ్వు
ఇప్పుడు మానవ హక్కులు అనే సరికి నేను నిన్ను ఏ విధంగా
ఎదుర్కోవాలో అని ఆలోచిస్తున్నా?

ఈ విశ్వ సృష్టికర్త ఒకవేళ మానవుల కోసమే ఆలోచించినట్లయితే మరి జంతు ప్రాణి సంగతి ఏంటి అని వస్తుంది. మనం జగత్తుకు ఏం చేస్తామో అదే మనకు వస్తుంది అన్న సూత్రానికి చివరికి అందరూ వస్తారు.

మనమందరం ఒప్పుకుందాం మాంసాహార భక్షణ అనేది ఒక సామాజిక సమస్య ఏళ్ల తరబడి లింగవివక్షను జాతివివక్షను వెన్నంటుతూ వస్తోంది. ఆడవారికి యూరోప్ దేశంలో కేవలం ఒక శతాబ్దం వెనకే ఓటు వేసే హక్కు మహిళలకు వచ్చిందని గుర్తుంచుకోండి. మనం తినే ప్రతి ముక్క వేరొక చోట ఒక పేద మనిషి తన జీవితాన్ని కోల్పోతున్నారు. ఈ భూమిని నరకప్రాయం చేయడమో లేక ప్రేమపూరిత ప్రాంతంగా మన పిల్లలకోసం తయారుచేయడమా? ఆలోచించండి. హక్కు ఇచ్చింది. కుల, జాతివివక్ష కేవలం కొన్ని శతాబ్దాల క్రితమే మొదలైంది. ఇంకా వివాదాలు ఉద్యమాలు నడుస్తున్నాయి.

ఎవరైతే హేతుబద్ధంగా కరుణతో ఆలోచిస్తారో వారికి ఇది జంతువుల జీవించే హక్కులు అని కూడా గుర్తిస్తారు. మనలో ఇంకా ఆటవిక తెగల మనస్తత్వం ఉందేమో అది ఈ ప్రపంచంలో మానవుడు కోసమే సృష్టించింది అని చెప్తుంది. మానవుని కోరికలే పర్యావరణానికి హాని. ఆ కోరికలే ఈ భూగోళం అంతా సొంత జాగీరుగా భావించడానికి మూలకారణం. గత శతాబ్దంలో ఈ పరిస్థితి మరింతగా దిగజారిందని శాస్త్రవేత్తలు ఆందోళన చెందుతున్నారు. మానవ కనీస అవసరాలైన ఆహారం, భూమి, నీరు

కొరకు కొట్టుకునే పరిస్థితి వస్తుందేమో.

మధ్యయుగ కాలంలో ఈ కోరికలే స్త్రీ మగవాడి కంటే తక్కువని మతం పేరుతో అణిచివేత జరిగింది. ఆడవారికి జంతువులకు సోల్ ఉండదని చాలామంది మతబోధకులు చెప్పేవారు. మరికొంతమంది వారికి సగం బుర్ర ఉంటదని, అపవిత్రులు అని చెప్పేవారు.

చాలామంది నల్ల వారంటే దేవుడు బానిసలుగా ఉండటం పుట్టించాడని అనుకునేవారు. కొన్ని దశాబ్దాల క్రితం గతంలో జరిగిన ఈ ఘోర తప్పిదాలు అన్నీ తప్పని తెలుసుకొని సరిదిద్దుకున్నాము. అలా జాతివివక్ష కుల వివక్షలు కూకటివేళ్లతో వేరి వేస్తున్నాము. ఆడవారు మగవారితో సమానం అని సామాజికంగా రాజకీయంగా, ఆర్థికంగా సమాన హక్కులు ఇస్తున్నాము. అలానే మరో ముందడుగు వేసి జంతువుల పరిరక్షణ చేద్దాం. మానవ హక్కులు, జంతువుల హక్కులు, లింగ భేదం లేని సమాన హక్కులు ఇవన్నీ కూడా ఒకప్పటి మానవుని సంకుచిత ఆలోచనతో పుట్టిన రుగ్మతల నుంచి వచ్చినవే. కాబట్టి పరిణితి చెందిన మనుషులుగా మనం దీనిని మరింత ముందుకు తీసుకు వెళ్ళాలి.

ఏ సమాజాలలో అయితే ఇంకా లింగవివక్ష, మానవ హక్కుల కొరకు ఇంకా పోరాడుతున్నారో వారైతే మరింత చొరవగా ఈ జంతు రక్షణ కూడా చేపడితే అప్పుడది సంపూర్ణం అవుతుంది. మానవుని దురాశ పూరిత కోరికలు ఇలాగే కొనసాగితే రాబోవు తరాలు పేదరికం పర్యావరణ లాంటి భయంకర సమస్యలతో పోరాడాల్సి ఉంటుంది. కనుక ఎంత తొందరగా హేతుబద్ధంగా ఆలోచించి జంతు సంరక్షణ చేపడతారో మరి ఇక మీ ఇష్టం.

## ముగింపు

సత్యాన్ని ఎదుర్కొనే ప్రయత్నంలో మిమ్మల్ని మీరు సమర్థించుకో వద్దు. నిజాయితీతో, నిడారంబరం గా, హేతుబద్ధంగా ఆలోచించండి. మిమ్మల్ని మీరు ఎలా ప్రేమించుకుంటారో అలానే ఎదుటివారిని ప్రేమించండి. కనీసం మీ సోదరసోదరీమణుల కోసం, భవిష్యత్తు తరాల పిల్లల కోసమైనా ఇకపై చికెన్ సూప్ బదులు టమాటా సూప్ తాగుతామని మనస్ఫూర్తిగా అనుకోండి.

మనిషిగా జీవిద్దాం, మనుషులను ప్రేమిద్ధాం.
మాంసాహారాన్ని వదిలేద్దాం.
మనం చేసే మేలైనా, కీడైనా తప్పక మళ్లీ మనకే తిరిగి వస్తుంది.

# రచయిత గురించి

సంజీవ్ నెవార్ వేదాలు, గీత మరియు సనాతన హిందూయిజాన్ని చదివిన పండితుడు. ఈయన వేదాలపైనా, యోగశాస్త్రం పైనా, ఆధ్యాత్మికం పైనా మరియు హిందూయిజంపై వేసిన వక్రీకరణల పైనా పలు పుస్తకాలు రచించారు. అగ్నివీర్ అనే సంస్థను స్థాపించి కుల సమానత్వం పైనా, లింగవివక్ష పైనా, ప్రాతీయ ద్వేషాలపైనా ఇటు భారతదేశం లోనూ అటు విదేశాలలోనూ ఆధ్యాత్మిక విప్లవం ద్వారా పోరాడుతూ కృషి చేస్తున్నారు. హిందూ ఏకత్వ యజ్ఞం ద్వారా ప్రాతాలలోనూ, కులాలోనూ సమానత్వం తీసుకుని వచ్చి సమసమాజం నిర్మించాలని కృషి చేస్తున్న వారిలో ముందంజలో ఉన్నారు. అంతేకాక వీరు సమాజంలో ఉన్న అసమానత్వం వల్ల నిరాశతో కృంగిపోయి, ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించే ప్రజలకు ఉత్తేజపూరిత కవితలు రాస్తూ, స్ఫూర్తి దాయక మార్గాలు చూపిస్తూ అనర్గళంగా ప్రసాగాలు ఇస్తూ వారికి దిశానిర్దేశం చేస్తున్నారు. వీరు ప్రతిష్ఠాత్మకమైన IIT-IIM ల పూర్వవిధ్యార్ధి. పేరొందిన డాటా సైంటిస్ట్, రిస్క్ మానేజ్మెంట్ నిపుణులు. జన్మ ఆధారంగా ఏర్పడే కులవ్యవస్థ సనాతన స్ఫూర్తికి విరుద్ధమని దీన్ని రూపుమాపి అసలైన వేదకాలపు విలువలతో నింపాలని కంకణం కట్టుకొన్న యోధుడు.

# అనువాద రచయిత గురించి

చిన్నప్పుడి నుంచి గురువులు, అమ్మా నాన్న చెప్పిన నీతి కథలు ఆసక్తిగా విని వాటి విలువలు, స్ఫూర్తి కథల వల్ల ఈ పుణ్యభూమిపై పవిత్ర భావంతో ఉండే వాడిని. సహజంగా అందరూ యుక్త వయస్సు ఉండే పోటి ప్రపంచంలో ఉంటే, నేనేమో NCCలో ప్రవేశించి కాంప్ లు, సామాజిక సేవలు చేస్తూ 'C' certificate సాధించాను. నా ఇంజనీరింగ్ చదువు తర్వాత VLSI రంగంలోని చిప్ డిజైనింగ్ లలో ప్రముఖ MNC కంపెనీలలో 18 సంవత్సరాలుగా పని చేస్తూ నేను చేసిన వినూత్న డిజైనింగ్ శైలిపై రాసిన పేపర్లు ఎలక్ట్రానిక్స్ రంగంలోని సుప్రసిద్ధ ఫోరంలలో పలు సార్లు ప్రచురితమయ్యాయి. సామాజిక స్పృహ ఉండడం వల్ల, ఉద్యోగంతో పాటు వారాంతాలలో నా వంతు వివిద సేవా కార్యక్రమాలు చేసేవాడిని. వృత్తిరిత్యా హైదరాబాద్, బెంగళూరు, అమెరికా, జెర్మనీ, సింగపూర్ తదితర దేశాలలో తిరిగుతు-న్నపుడు భారతదేశం యొక్క విశిష్టత మరింత బాగా తెలిసింది. ఒక పక్క మన సమాజంలో ఉన్న సామాజిక, ఆర్థిక అసమానతలు పట్ల బాధపడుతూనే, మరోపక్క భారతదేశ విఛ్చిన్నత కొరకు విదేశియులు రాయించిన అట్రాసిటీ సాహిత్యాలు చదివాక ఉద్రేకపడ్డాను. నా సత్యాన్వేషణలో ఎందుకు ఈ విదేశియులు ఇన్ని వక్రీకరణలు చేస్తూ మన భారతదేశపు యువత మనసును చెడగొట్టి, విడగొడుతున్నారా అని మధన పడ్డాను. మత మార్పిడిలు, సాంస్కృతిక దాడుల నేపధ్యంపై నా చైతన్య భావాలను కవితలుగా, వ్యాసాలుగా రాస్తే మ్యాగజైన్స్, దిన-పత్రికలు ప్రచురించేవారు. శివశక్తి కరుణాకర్ గారి పరిచయంలో టివీలలో డిబేట్లు చేస్తూ సత్యాన్ని ప్రజలకు చేరవేసే ప్రయత్నం చేసేవాడిని.

తెలుగు రాష్ట్రాల వారందరికీ గోమాత పరిరక్షణ యొక్క ప్రాముఖ్యత మరింత తెలియాలని అగ్నివీర్ ధార్మిక సంస్థాపకుడు అయిన సంజీవ్ నెవర్ గారిని సంప్రదించడం, ఆయన వెంటనే స్పందించి తెలుగులో అనువదించుటకు నాకు ఈ అవకాశం ఇవ్వడం జరిగింది. నా మిత్రుడు కళ్యాణ్ యాండ్ర తన వద్ద ఉన్న పవిత్ర వేద పుస్తకాలన్నీ నాకు ఇచ్చి సహకరించారు. నేను చేస్తున్న ఈ చిరు ప్రయత్నం వల్ల, భవిష్యత్తులో మీ అందరూ చేయబోయే గురుతరమైన సేవల ఫలితం గురుంచి తెలిసినపుడు, నా తల్లిదండ్రులు,

నా భార్య, పిల్లలు, చెల్లిళ్ళు, నా ప్రియ మిత్రులు చాలా సంతోషించారు. అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ పుస్తకం ఎవరితో అయినా, ఎక్కడయినా నేరుగా లేక వివిధ టివీ, సోషియల్ మాధ్యమాలలో వాదన చేసేవారికి ఆయుధం లాంటిది.

-పల్లం అమర్ చంద్

MTech(VLSI), MBA(Finance)

# అగ్నివీర్ గురించి

అగ్నివీరును ఐఐటి-ఐఐఎమ్ నిపుణుడు, డాటా సైంటిస్ట్ మరియు ఒక యోగి అయిన శ్రీ సంజీవ్ నెవెర్ గారు స్థాపించారు. పరిష్కార పూరిత, ఆధ్యాత్మికత, నిజాయితీతో, ప్రపం చాన్ని అంతర్ముఖంగా మరియు బాహ్యాముఖంగా అభివృద్ధి చేయుటకు సంకల్పించారు. జీవితంలో వస్తున్న సమకాలీన సమస్యలు సవాళ్లకు వేదాలు, భగవద్గీత మరియు యోగాల నుంచి ఆచరణాత్మక ఆదేశాలు ఇవ్వడంలో అగ్నివీర్ ప్రత్యేకత. ఆత్మహత్య చేసుకుందామని అనుకున్న చాలామందిని, నిరాశావాదంలో కూరుకుపోయిన వాళ్లని, జీవితంలో గందరగోళ పరిస్థితుల్లో చిక్కుకున్న వాళ్ళను, దిశానిర్దేశం లేక ఇబ్బందిపడుతున్న వేలకొలది ప్రజలకు అగ్నివీర్ పరివర్తన తెచ్చి పరిష్కారాలు ఇచ్చింది.

సమాజం వదిలేసిన అనేక ముఖ్య సమస్యలను, చెప్పుకోలేని బాధలను ప్రజల ముందుకు తీసుకు వచ్చిన ఘనత అగ్నివీర్ దే. వివక్ష లేని సమ సమాజం కోసం చేసే 'దళిత యజ్ఞం' కార్యక్రమాలలో అగ్నివీర్ ముందంజలో ఉంది. సాంప్రదాయ ముసుగులో ముస్లిం యువతుల హక్కులను అణిచి వేయకూడదని చేసే ఉద్యమంలో అగ్నివీర్ దూసుకుపోతోంది. హలాల, బహుభార్యత్వం, త్రిపుల్ తలాక్, లవ్ జిహాదీ, వ్యభిచారం వంటి జుగుప్సాకర సంప్రదాయాలను వెలికితీసి వాటిపై వ్యతిరేకంగా ప్రజాభిప్రాయం కూడగట్టడంలో అగ్నివీర్ విజయం సాధించింది. అగ్నివీర్ మహిళ సహాయ కేంద్రం ఇటువంటి ఎన్నో కేసులను పరిష్కరించి వారి జీవితాల్లో ఆనందం నింపింది.

దేశంలోని సున్నిత ప్రాంతాలలో ఆయుధాలు లేకుండా ఎలా నేరస్తులను, సంఘవి ద్రోహులను ఎదుర్కోవాలో వర్క్‌షాపులను అగ్నివీర్ జరిపింది. రాడికల్సును తగ్గించి, సంఘ జీవనంలో ప్రజలను పాల్గొనేటట్లు చేసింది. అగ్నివీర్ అసలైన చరిత్రను వివరించడంతో రాజకీయ కారణాలతో చలామణి అవుతున్న ప్రచురించిన చరిత్రను ప్రశ్నించడం మొదలుపెట్టారు.

సమసమాజం పైన, కుల వివక్ష పైన, లింగ వివక్ష పైన, మానవ హక్కుల పైన, మతపరమైన హక్కులు, వాటి చరిత్ర లపై అగ్నివీర్ చాలా పుస్తకాలు

ప్రచురించింది. ఇవేకాక యోగ, హిందూయిజం, స్వీయ పరివర్తన వంటివాటిపై కూడా పుస్తకాలు రచించింది. పాఠకులు పుస్తకాలలోని నిర్మొహమాటంగా చెప్పిన విధానం, అసలు మూలం, ఆచరణాత్మక విధానం, పరిష్కార పూరిత నేపద్యం వంటివాటితో అద్భుత అనుభూతిని పొందారు.

ఎవరైతే అర్థవంతమైన సంపూర్ణ జీవితాన్ని జీవించాలనుకుంటారో వారంతా అగ్ని వీరిలో ప్రవేశించవచ్చు లేదా అగ్నివీర్ సంకల్పానికి సహాయం చేయవచ్చు.

To know more about us,

kindly visit Website: www.agniveer.com

Facebook: www.facebook.com/agniveeragni

Youtube: www.youtube.com/agniveer

Twitter: www.twitter.com/agniveer

To join us to be part of Agniveer, please fill our membership form: www.agniveer.com/membership-form/

To contribute to Agniveer, kindly make payment through

Payment page: www.agniveer.com/pay

Paypal: give@agniveer.com

To purchase other books from Agniveer, please

visit: www.agniveer.com/books

AGNIVEER

SERVING NATION | PROTECTING DHARMA